# ఖర్చులు తగ్గించుకొనేందుకు-
# సిఫార్సు ప్రకారం ఎరువులను వాడండి










నీటిసాగు మిరప, ప్రత్తి పంటలకు సిఫార్సు ప్రకారం ఎరువులను వాడిన చాలా లాభకరం.

ఏ పంటకైనా ఎరువుల వాడకంద్వారా ఒక క్వింటాలు దిగుబడికయ్యే ఖర్చును తగ్గించవచ్చు. నీటిసాగు మిరపపంటకు, సిఫార్సు ప్రకారం ఎరువులను వాడిన, ఒక క్వింటాలు మిరపకాయ పండించటానికి అయ్యే ఖర్చు క్రింద సూచించిన విధంగా తగ్గుతుంది.

| నీటిసాగు మిరప పంట | ఎరువులు వేయకపోతే | సిఫార్సు ప్రకారం ఎరువులు వేసినప్పుడు |
|---|---|---|
| ఎకరానికి సాగుబడి ఖర్చు | రు. 1600/-లు | రు. 2170/-లు |
| ఎకరానికి దిగుబడి | 4 క్వింటాళ్లు | 10 క్వింటాళ్లు |
| క్వింటాలుకు ఖర్చు | రు. 400/-లు | రు. 217/-లు |

పైవిధంగానే, ప్రత్తిపంట సాగుబడిలో కూడా సిఫార్సు ప్రకారం ఎరువులను వాడిన, ఒక క్వింటాలు ప్రత్తి పండించటానికయ్యే ఖర్చు తగ్గుతుంది. పంట ఖర్చులు తగ్గించుకోవాలన్నా, హెచ్చు లాభాలు పొందాలన్నా సిఫార్సు ప్రకారం ఎరువులను వాడాలి.

నీటిసాగు మిరప, ప్రత్తి పంటలకు అనువైన ఎరువు. విజయ్ 17-17-17. ఎకరానికి 140 కిలోల విజయ్ 17-17-17ను దుక్కిలోను, 80 కిలోల విజయ్ యూరియాను పైరుమీద వేయండి. మొక్కలను మడిలో నాటేటప్పుడు విజయ్ 17-17-17ను మొక్కలకు 5 సెం.మీ. లోతుగాను, 5 సెం.మీ. ప్రక్కగాను వేయండి.

ఇంకా వివరాలకు ఈ క్రింది చిరునామా నుండి ఈ పంటకు సంబంధించిన పుస్తకాన్ని తెప్పించుకోండి.

ఏరియా మేనేజరు
మద్రాసు ఫర్టిలైజర్సు లిమిటెడ్
44, శాంతినగర్
హైదరాబాద్-500 028




## పైర్లు సరియైన పోషణకు విజయ్



| విజయ్ 17-17-17 ఎరువుల నిర్ణీత పరిమాణముల శాతం | |
|---|---|
| నత్రజని | 17 |
| భాస్వరం | 17 |
| పొటాష్ | 17 |
| నింపుడు పదార్థం (మెత్తని ఇసుక లేదా డొలమైట్) | 12.5 |

ITM-MFL-2316

## అర్హత ఏమిటి ?

"మాతృభూమి" అనే మళయాళ పత్రికకు శ్రీమతి జయాచక్రవర్తి యిచ్చిన ఇంటర్వ్యూ సారాంశం మా (మా) ఆంధ్ర సచిత్ర వార పత్రిక (3.8 82 సినిమా)లో చదివాక ఈ ఉత్తరం వ్రాయాలనిపించింది.

ఇంతకాలం రాజకీయ రంగం పట్ల ఏమాత్రం ఆసక్తి చూపని ఎన్టీ ఆర్ రాజకీయ ప్రవేశం జయాచక్రవర్తిగారికి హాస్యాస్పదం అనిపించిందట. మరి ఈవిడగారికి ఈ వయసులో రాజకీయ రంగ ప్రవేశం చేయాలని ఎందుకు దుర్బుద్ధి పుట్టిందో!? జవహర్లాల్ నెహ్రూ, సర్వేపల్లి రాధాకృష్ణన్, విజయలక్ష్మిపండిట్ వంటి వార్లతో స్నేహ సంబంధం ఉన్నంతమాత్రాన రాజకీయ రంగ ప్రవేశానికి యోగ్యతా పత్రం సంపాదించుకున్నట్లేనా? మరి శ్రీ ఎన్టీ ఆర్ వంటి వ్యక్తులు కె. ఎల్. రావ్ వంటి రాజకీయ దురంధరులతో ఆది నుంచి స్నేహసంబంధాలు, రాజకీయానుబంధాలున్నవని శ్రీమతి జయాచక్రవర్తికి తెలియక పోయుండవచ్చు. కేవలం వ్యక్తిగతంగా రాజకీయ నాయకులతో పరిచయ భాగ్యాలున్నంత మాత్రాన తగు అర్హత అనిపించుకున్నట్లయితే, ఈ దేశంలో ప్రతి వ్యక్తి ఒక రాజకీయ నాయకుడయినట్లే !

అసలు రాజకీయరంగానికి కావలసిన అర్హతలేమిటి ?

నేడు రాజకీ (నేటి రాజకీయాలకు) యానికి సరయిన నిర్వచనం చెప్పలేక సతమతమయిపోతున్నారు మేధావులు. మరి ఇటువంటి తరుణంలో ఈవిడగారేమో తగు అర్హతలున్నవాళ్లు రాజకీయరంగ ప్రవేశం చేయుటంలో తప్పులేదని తనని తాను సమర్థించుకుంటూ, రాజకీయానికి క్రొత్త నిర్వచనము చెప్పబోతున్నారు. ఇంత కాలం పైలెట్ గా శిక్షణ పొందుతున్న రాజీవ్ గాంధి హటాత్తుగా రాజకీయోపదేశం పుచ్చుకొని బడా నాయకుడైపోయాడు. మరి ఈ అబ్బాం. రి కున్న అర్హతలేమిటో ఢిల్లీ వెళ్లి అమ్మను అడిగిరమ్మనండి.




ఇక మద్రాసు, బళ్లారి, తిరుత్తణి ఈ ప్రదేశాల విషయంలో యన్టీ ఆర్ ప్రస్తావించడం కేవలం గత చరిత్రను త్రవ్వి చూసారే కాని, ప్రాంతీయ దురభిమానంతో పలుకలేదు. మద్రాసువంటి మహానగరాన్ని ఆంధ్రుల నుండి ఏ విధంగా కుట్ర కుతంత్రాలు జరిపి, తమిళ సోదరులు పొందగలిగారో ఒకసారి గత చరిత్రను సింహావలోకనం చేసుకుంటే తెలుస్తుంది. నాటికీ, నేటికి ఆయా నగరాలలో తెలుగు సంస్కృతీ సాంప్రదాయాల సుమసౌరభాలు ఘుమ ఘుమలాడుతూనే ఉన్నవన్న సంగతి శ్రీమతి జయాచక్రవర్తిగారు గుర్తించాలి.

మూరాడనారాయణరావు (డొంకలూరు, బారువ)

## సంప్రదాయ విరుద్ధం

"ధర్మోరక్షతి రక్షితః" అన్న సీరియల్ కథ— పాత్రలు, సంభాషణ చక్కగా ఉన్నవి. సనాతన సంప్రదాయ ధర్మాలకు ప్రతీకగా వ్రాయబడుచున్న ఈ కథలో ప్రాచీన ధర్మ వైరుధ్యం రాకుండా చూచుకొనడం మంచిది. దీక్షితులుగారు పెద్ద కొడుకు పరమేశ్వరశాస్త్రికి పెండ్లి అయిన వెంటనే పనిలో పనిగా గౌతమునికి ఉపనయనం చేసినారు. వివాహం చేసిన తర్వాత ఆ యింటిలో ఉపనయనం చేయుట సంప్రదాయ విరుద్ధం. ముందు ఉపనయనం చేసి తర్వాత వివాహం జరిపించడం సంప్రదాయ ధర్మం. దీక్షితులు వంటి వేదధర్మ పరిపూర్ణుల చేత ఈ సంప్రదాయ వైరుధ్యం జరిపించుట కల్పిత కథ అయినా అవుచిత్యంగా లేదు.

ఎన్. వి. ఎస్. సుబ్రహ్మణ్యం (బొబ్బిలి)

## సుమలత

"నేనూ ఒకప్పుడు ఫాన్ నే" అన్న నటి సుమలత గారి శీర్షిక, శీర్షికతో పాటు ప్రచురించిన ఆమె చిత్రం ఎంతో బాగా నచ్చినవి. సుమలత ముఖచిత్రంతో త్వరలో ఒక పత్రికను విడుదల చేస్తారని ఆశిస్తున్నాము.

కైలాష్ ప్రసాద్, ఇతరులు (గ్వాలియర్)

## సవాలు

'నిలకడలేని మనుషులు' చదివిం తరువాత ఈ ఉత్తరం వ్రాయాలనిపించింది. కథలోని సంఘటనలు, వర్తమాన సామాజిక దర్పణం అయినప్పటికి ఉపాధ్యాయులు విశ్వనాథం, నరసింహమూర్తి సంభాషణ, విశ్వనాథం ప్రవర్తన, మానవత్వపు విలువల్ని దిగజార్చింది. కథావిధానం, శైలి బాగున్నప్పటికి ఉపాధ్యాయ ప్రవృత్తికి ఆ సంఘటనలు ఒక సవాలు. రచయిత పాత్రల ప్రవృత్తిని, సంఘటన స్థల వర్ణనలుగురించి తగు జాగ్రత్త చూపిన, సమాజానికి దర్పణం చూపటంలో కృతకృత్యులు అయి వుండే వారు.

యం.వి. రామారావు (మొగలికుదురు)

## చిన్న పుస్తకం కాదు

20—8—82 సంచికలోని 'దాంపత్య సంగీతం' అనే కొత్త సీరియల్ చదివాను. రచయిత్రి శ్రీమతి కల్యాణి సోమరాజు గారికి ఎం. బి. బి. ఎస్ ఏ సంవత్సరంలో ఏ సబ్జక్ట్సు వుంటాయో తెలిసినట్లు లేదు. అలాంటప్పుడు ఫైనలియర్ చదువుచూ 'ఎనాటమీ' బుక్ పుచ్చుకుని సాయంకాలపు అందచందాలని ఆస్వాదిద్దామని తోటలోకి అడుగు పెట్టడమేమిటి ? చేతిలో వుంచుకోవడానికి అదేమీ చిన్నవారపత్రిక కాదు, 1500 పేజీల పైగా గల ఒక గ్రంథం!

ఎం. సురేష్ (విజయవాడ)

## మనిషి

చిరంజీవి, గీత ముఖచిత్రంతో వెలువడ్డ సంచికలోని 'మనిషి' కథ సామాజిక స్పృహ కల్గిన చక్కని రచన.

వి. లక్ష్మణరావు (ఖరగ్‌పూర్)

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938 1972]

శుక్రవారం 17-9-'82

దుందుభినామ సం. భాద్రపద బ. అమావాస్య

సంపుటము 75 సంచిక 3

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

ఆరు మాసాల చందా రు 42 90

పోస్ట్‌లో ఏడాది చందా రు 85 80

విడి ప్రతి వెల రు 1-50

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003

# విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటుడు కమలహాసన్

(ఫోటో : పి. రవిచందర్ రావు)

**కథలు :**



**సీరియల్ నవలలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**



















# రాజధానిలో రాష్ట్రరాయబారి కార్యాలయాలు

ప్రధానమంత్రి ఇంటికి ఒక ఫర్లాంగు దూరంలో ఉన్న ఏ రాయిని తీసిచూసినా దానికింద ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి నక్కి ఉండవచ్చు. 1, సఫ్దర్ జంగ్ రోడ్, న్యూఢిల్లీకి ఎప్పుడయినా వెళ్లండి — ఒక అరడజను ముఖ్యమంత్రులు కనబడతారు.

వీరంతా ఎందుకు వస్తారు? ప్రధానమంత్రికే తెలియాలి. ఆవిడ పిలిస్తేనే వీరందరూ ఢిల్లీ వెడతారు. బాబాసాహెబ్ భోన్స్‌లే (మహారాష్ట్ర) వారంలో సగం రోజులు ఢిల్లీలో ఉంటారు, మిగతా సగం రోజులు బొంబాయిలో విశ్రాంతి తీసుకుంటూ ఉంటారు. మహారాష్ట్ర రాజకీయాల కేంద్రం సతారా. ఈ రాష్ట్రం ముఖ్యమంత్రి నియమింపబడిన వారు కాదుట. అదిసరే; టెలిఫోన్‌లు, టెలెక్స్‌లు, రేడియో ప్రసారాలు ఉన్నప్పుడు ముఖ్యమంత్రులు, ఇతరులు ఎందుకు స్వయంగా ఢిల్లీ వెళ్ళాలి? ఒక ముఖ్యమంత్రిని ఊరికే ఢిల్లీ పిలిస్తే, రాష్ట్రంలో అతను చేసే పని ఏమి కావాలి? కీ. శే. బిధాన్ చంద్ర రాయి పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రిగా ఉంటున్నప్పుడు ఎవరయినా అతన్ని పిలవగలిగేవారా? అసలు ఆయనతో మందలింపు ధోరణిలో మాటలాడేవారా? కీ శే పండిట్ నెహ్రూ కూడా ఈ పని చెయ్యలేకపోయేవారు. బిధాన్ చంద్ర రాయే పండిత నెహ్రూకి హితవు చెబుతూ ఉండే వారు. జవహర్‌లాల్ నెహ్రూ వినేవారు.

## న్యూఢిల్లీ లేఖ

### సఫ్దర్ జంగ్ దుబాషీ

ఎవరయినాసరే ఇక్కడికి తరుచు వెడుతూ ఉండాలి. కాని, శ్రీ భోన్స్‌లే సతారాలో కన్నా ఢిల్లీలోనే ఎక్కువకాలం గడుపుతూ ఉంటారని మా స్నేహితుడు ఒకాయన అంటూఉంటారు. [శ్రీ భోన్స్‌లే వంటి వారి కదలికలని పరిశీలించటం ఈయనకి సరదా.] ఢిల్లీ పెద్ద ఊరు. ఇందులో కొత్తవారికి తోచటం కష్టం. అందుకని శ్రీ భోన్స్‌లే అనుచరులు ఆయనకి తోడుగా వచ్చి పోతూఉంటారు. అనుచరులు ఉంటే అసమ్మతి వాదులు ఉండకుండా ఉంటారా? ముఖ్యమంత్రి ఏ భవన్‌కో, ఏ అరుణ నెహ్రూకో స్నేహితుడు కారాదని అసమ్మతి వాదుల తాపత్రయం. ఇటువంటివారే కదా ద్వారపాలకులు!

కాంగ్రెసు (ఇందిర) ముఖ్యమంత్రులంతా ఇంతే. కాదని శ్రీమతి గాంధీ అంటారు. వారంతా ఎన్నిక అయిన వారేకాని ఆమెచేత జ్యోతిబసు సంగతి తీసుకోండి. ఆయన కాంగ్రెసు (ఇందిర) పార్టీవారు కాదు. అయినాసరే, ఆయనకీ ఢిల్లీ యాత్రలు తప్పటంలేదు! అంటే ఆయన అర్జున్‌సింగ్, భోన్స్‌లేల పద్ధతి మీద ఢిల్లీ రారనుకోండి, అశోక్ మిత్ర (అంతర్జాతీయ ద్రవ్య సంస్థ వలన పేరు పొందిన వారు) ఒకప్పుడు జ్యోతిబసుకు ఆర్థిక వ్యవహారాల మీద సలహాలు ఇచ్చేవారు. ఆయన కలకత్తాలోని రైటర్స్ బిల్డింగ్స్‌లో కన్నా న్యూఢిల్లీలోని నార్త్ బ్లాక్‌లోనే ఎక్కువకాలం గడిపేవారు.

రాష్ట్ర నాయకులు ఇందరు ఢిల్లీ రావటానికి మరొక కారణం ఉంది — వాళ్ల రాష్ట్రంలో ఎక్కడా ఢిల్లీలో లభించే వైభోగం లభించదు. ప్రతి రాష్ట్రానికీ న్యూఢిల్లీలో "రాయబారి కార్యాలయం" ఉంటుంది. అందులో ఖరీదయిన అలంకరణలు ఉంటాయి. [బాగా ఉండవు కాని అది వేరే సంగతి.] ముఖ్యమంత్రులకి ఎయిర్‌కండిషన్డ్ గదులు వగయిరాలు ఉంటాయి. రాష్ట్ర ప్రభుత్వాల "రాయబారి వర్గాలు" 5-చుక్కల హోటళ్లవంటివి. అయినా మహారాష్ట్ర భవన్ చాలదని అబ్దుల్ రహమాన్ అంతూలే తాతా వారి తాజమహల్ హోటల్‌లో దిగేవారు. ఆయనదంతా స్పెషల్. రోజుకి రు. 1500 బిల్ అయితే మాత్రం ఏమి? భరించేది సామాన్యుడే కదా? [అసలు అంతూలే హోటల్ బిల్‌లని తాతావారే ఇచ్చేవారేమో? ఈ సంస్థ వారు అంతూలేని తమ మనిషి కింద చూసుకునే వారు. ఆయన వాళ్ల మనిషేమో కూడా. వివరు చెప్పగలరు?] ముఖ్యమంత్రులు తమ డబ్బు కర్చుపెట్టరు. ఢిల్లీ వారికి మరొక సొంత ఊరు.

ప్రజాస్వామ్య దేశాలన్నిటిలోనూ ఇలాగ ఉండదు. అమెరికా అధ్యక్షుడు రీగన్ న్యూయార్కు వస్తే హోటల్‌లో ఉంటారు. ఎందుకంటే, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో అధ్యక్షుడికి ఇతర నగరాలలో ప్రత్యేక భవనాలు ఉండవు. అమెరికాలో గవర్నర్‌లనే వారు రాష్ట్రాలలో ఉంటారు. వీరు వాషింగ్‌టన్ వస్తే "వైట్ హవుస్" లో ఉండరు. ఎవరి బస వారు చూసుకోవలసిందే.

బ్రిటన్‌లో సామ్రాజ్య సంప్రదాయాలు పెంపొందాయి. అయినా ఈ దేశంలో కూడా ప్రధానమంత్రి లండన్ వదిలి వెడితే హోటల్‌లో ఉండవలసిందే. ప్రధానమంత్రే కాదు రాణి సయితం హోటల్‌లో ఉండాలి. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని వివిధ రాష్ట్రాలకి వాషింగ్‌టన్‌లో రాయబారి కార్యాలయాలు ఉండవు. అందరికీ దినసరి విలవెన్సులు ఉంటాయి. అవి చాలకపోతే సొంత డబ్బు ఖర్చు చేసుకోవాలి. ప్రజల డబ్బు కర్చు చేస్తానంటే కుదరదు. లండన్‌లో, వాషింగ్‌టన్‌లో ప్రభుత్వోద్యోగులకి "క్వార్టర్స్" ఉండవు. అమెరికాలో ఫెడరల్ రిజర్వ్ శాఖ ఒకటి ఉంటుంది

# కొత్త సంవత్సరానికి పాతకాలపు ఆయిల్-బౌండ్ డిస్టెంపరా?



## బ్రిటిష్ పెయింట్స్ వైనల్ తెచ్చుకోండి మీ ఇంటి గోడల చేత ఉగాది శుభాకాంక్షలు పలికించండి

కొత్త సంవత్సరం, కొత్త ఇల్లు,
ఇంట్లోకి కొత్త పెళ్లికూతురు—
ఇన్ని కొత్త శుభ సందర్భాల్లో ఎవరైనా పాతకాలపు
ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ ఇష్టపడతారా? మీ ఇంటి
గోడలకు వైనల్ వెయ్యండి. అవి ఎలా
జీవంతో కళకళలాడతాయో చూడండి.

వైనల్ మీ గోడలకు మన్నటి ఫినిష్
ఇస్తుంది, ఖరీదైనవిగా కనిపించేలా
చేస్తుంది—మును పెన్నడూ లేనంతగా!
వైనల్ వల్ల మరెన్నో ప్రత్యక్ష ప్రయోజనాలు
కూడా—ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపరూ పోటీ
పడలేనివి! ఇవన్నీ అదనపు ఖర్చేమీ
లేకుండానే.




వైనల్‌ని ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపర్‌తోనైనా పోల్చి చూడండి. ప్రతి విషయంలోనూ అతి శ్రేష్ఠమైనది వైనల్.

| | వైనల్ | ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ |
|---|---|---|
| ఫినిష్ | చక్కటి, నున్నటి | బాగుండదు |
| ఆరడానికి పట్టే సమయం | 4 గంటలు | 12 గంటలు |
| వాసన | ఇంపైనది | భరించలేనిది |
| కడుక్కోవేందుకు | ఎంతో వీలైనది | వీలుగా వుండదు |
| రంగు నిలిచి వుండటం | దివ్యం | పరవాలేదు |
| మన్నిక | ఎక్కువ | తక్కువ |
| వెయ్యడం | —తేడా లేదు— | |

...అన్నిటినీ మించిన విషయం, 5 కిలోల ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ కావలసినచోట్ల విస్తీర్ణానికి, కేవలం 2 లీటర్ల వైనల్ చాలు!

## బ్రిటిష్ పెయింట్స్ వైనల్

ఆనందప్రదమైన తరుణంలో విశిష్టమైన పెయింట్

LINTAS(C)/VNL/66/2317 TL

## న్యూఢిల్లీ లేఖ

దాని అధ్యక్షుడు వాషింగ్‌టన్‌లోని ఒక చిన్న హోటల్‌లో గది తీసుకుని స్వయంపాకం మీద బతుకుతాడు. ఆయనకి జీతం మాత్రం ఇస్తారు. ఇంకేదీ ఉండదు.

భారతదేశంలో ఎంత వెనుకబడిన రాష్ట్ర మయితే న్యూఢిల్లీలో అంత గొప్ప 'రాయబారి కార్యాలయం' ఉంటుంది ఉత్తర ప్రదేశ్ బాగా వెనుకబడి ఉన్న రాష్ట్రం కదా? మరి ఈ రాష్ట్రప్రభుత్వం వారు చాణక్య పురిలో ఒక పెద్ద గెస్ట్‌హవుస్ కట్టించారు. రాష్ట్ర మంత్రులూ, అధికారులూ ఇందులో దిగి విశ్రాంతి తీసుకుంటూ ఉంటారు. గోవా అంత చిన్న రాష్ట్రమే ఒక గొప్ప "గోవా హవుస్" కట్టించుకుంది. ముఖ్యమంత్రికి చికాకులు ఎక్కువ అయితే ఇక్కడికి వచ్చేస్తూ ఉంటారు.

భారత దేశం బీద దేశం. ఈ బీద దేశం ప్రజల సొమ్ముతో ఈ వైభవాలూ, పటాటోపాలూ ఏమిటి? అధికార వికేంద్రీ కరణం కంటే ముందు ఈ రాష్ట్ర రాయబారి కార్యాలయాలు పోవాలి. ముఖ్యమంత్రులూ, వారి పరివారాలూ చీటికి మాటికి దేశ రాజధానికి రావటం ఏమిటి? భోన్స్‌లే పని బొంబాయిలోనా? ఢిల్లీలోనా? ఆయన ప్రత్యర్థి అంతూలే కేంద్ర కార్యాలయం బొంబాయేనా? లేదా ఢిల్లీ అనుకోవాలా? ★

# రాయాల్సినకథ - వి.వి.బి.రామారావు




పెట్టెలో ఆఖరి సిగరెట్టు ముట్టించుకో బోయారు విశ్వనాథంగారు. చటుక్కున వెలిగి ఆరిపోయింది అగ్గిపుల్ల. మరో పుల్ల తీయబోయి ఖాళీ అగ్గిపెట్టె చూసుకుని సిగరెట్టు పెట్టెలో పెట్టేశారు.

"నమస్కారం గురూగారూ!... తీరికగా కూచున్నారు... లెర్నర్స్ ఎవరూ రాలేదా?"

రోడ్డుమీద వెళుతూ ఓ ఆయన విశ్వనాథంగారిని పలకరించాడు.

"ఆటలవుతున్నాయట అయోధ్యా మైదానంలో, అక్కడికి పోయారు... అవిటి వాడిని అరుగుమీద కూచున్నా... అగ్గిపెట్టె ఉందా? అన్నట్టు నువ్ సిగరెట్టు కాల్చవు కదూ!"

"లోపలికెళ్లి తెస్తాలెండి!"

"వద్దులే... అది మడిలో ఉంటుంది... గాసేపు ఆగుతాలే... అవునోయ్ ప్రసాదూ...

## రాయాల్సినకథ

ఈ మధ్య కనబడడం లేదు. కమాను వెళ్లావా?"

"కమాను లేదు పాడూలేదు. ఇంటింటా తిరిగి ఓటర్ల జాబితా రాయమన్నారు. ఉపాధ్యాయ వృత్తి అన్నతరువాత మామూలు మనుషులు కంటే మాలో సామాజిక స్పృహ ఉండాలిగా..."

"రచయిత వనిపించుకున్నావ్ సుమా.."

—"ఇదిగో అగ్గిపెట్టె!" లోపలి నుంచి సోమిదేవమ్మగారు అందించారు.

"నమస్కారం అమ్మగారూ!"

"ఆశీర్వాదం నాయనా..."

"నేనెటూ బజారుకే బయలుదేరాను... కూరగాయలేమైనా కావాలా?"

"ఏం అక్కరలేదులే..."

నంచి ఊపుకుంటూ మెట్లు దిగుతున్న ప్రసాదుకి మనసులో ఏదో మెదిలింది ఆయన అవిటివాడు... డయబెయటిక్ గాంగ్రీన్ అయితే నలభైవ ఏటనే కాలు తొడవరకూ తీసేశారు. ఉద్యోగం పోయింది. పైగా పెద్ద రోగం... ప్రకృతిని నమ్ముకొని ఆ చికిత్సా విధానం పాటిస్తూ పిల్లలని ఏవరంతటి వాళ్లని చేసేసి భార్యా భర్తలిద్దరూ చల్లగా సంసారం చేసుకుంటున్నారు

విశ్వనాథం పిల్లల డబ్బుమీద ఆశపడే మనిషి కాదు. తనకు ఒక కాలు లేకపోయినా, రెండో కాలు పనికి రాకపోయినా ఎప్పుడూ ముఖంలోకి విషాదం తొంగి చూడనియ్యకుండా హుందాగా, ఆనందంగా బ్రతుకుతున్నారు. నుదుటన విభూతి పిండికట్లు, కుంకుమబొట్టు... నవ్వుతూ ఆత్మీయుల్లా అందరితో మాటాడుతారు.

ఆయన భార్య సోమిదేవమ్మ మాటలనిండా ఆత్మీయతే. ముఖంలో ఎప్పుడూ ప్రసన్నతే.

ఆవిడ కష్టాలు తెలిసిన వాళ్ళకి ఏంత కష్టం కలిగించినా ఆవిడకేం కష్టం కలిగించవేమో. చూసేవాళ్లెవరైనా ఆవిడ అలాంటి కష్టాలను ఎలా మోయగలుగుతుందన్న ప్రశ్నను వేసుకుంటే కాసేపటికి ఆవిడ స్థైర్యం వెనుక ఉన్న బలం ఆమె పాతివ్రత్యమని తేటతెల్లమై మన పురాణాల లోని, ఇతిహాసాలలోని పతివ్రతలమీద గౌరవం కలుగుతుంది. అంతకు ముందే ఉన్నవాళ్లకయితే ఇనుమడిస్తుంది. తృప్తికీ, ఆనందానికీ

### ఏలుగుదుతు తిప్పుతున్న పెట్రమ్

రెక్కల మీద
మాడే డొక్కల మీద
'కరెన్సీ'ని కారు సొకగా పరిసేసి
సవాలచ్చ తలకాయల్ కొని
స్ ... అర్సిపాయ్‌నా
నడువ్ వాల్సనియండొరే—

స్వరగ సొక్కే ప్లిస్సి
పట్టు పరుపుల మీద ఇసిరేసి
ఎన్నికల వోగ్దానాల్లో
ఎన్ని కలలో గంటూ
ఇంసక్కా నిద్దరోతన్నా!
నన్నెవురూ లేపకండొరే—

అయినా
నీ యబ్బ సొమ్మేం బొయ్యింది
తెగ మొరుగుతిన్నావే నా 'బొజ్జ' జూసి
నేనేం ఎనకేసినా నా కొరకు ?
నీ యువ్వ—
జాస్తి మాట్లాడినవా
నా ఇట్టం
గుర్రెట్టి నిద్దరోతాను
రేపొచ్చే ఎలక్సన్ల వొరకు !—

— కలికిరి వి. అబ్దుల్ ఖాదర్

భౌతిక భోగభాగ్యాలకీ సంబంధం లేదని ఋజువు చేసేవారి దాంపత్యం వెలుగునే వెదజల్లుతుంది

ప్రసాద్ కూడా ఓనాడు ఆయన దగ్గర షార్ట్‌హాండ్ నేర్చుకోవాలనుకున్నవాడే... నేర్చుకున్నవాడే!

—కంపెనీలో స్టెనోగా పనిచేసి రోగంతో అవిటి వాడయి, ఉద్యోగం పోగొట్టుకున్న విశ్వనాథం తన విద్యనే నమ్ముకున్నారు. తెల్లవారిన దగ్గర నుంచి రాత్రి ఎనిమిదింటి వరకూ షార్ట్‌హాండ్ నేర్చుకొనే పిల్లలు వస్తూనే ఉంటారు. లేదన్న చింత లేకుండా, అవిటినన్న ఆరాటం లేకుండా, జీవితం గడుపుకొస్తున్న మనిషి.

—బజారు నించి తిరిగొచ్చి ఓటర్ల జాబితా రాసుకుంటుంటే ఏవో రాయాలనిపించి... కాగితం మీద నాలుగు ముక్కలు కథకి మూప రాసుకున్నాడు ప్రసాద్. వికలాంగుల

సంవత్సరం... ప్రభుత్వం మాటలు... మాయ... మీడియా గోల... జోల... అవిటి వాళ్ళ యావ...

మూస మనసులో మెదులుతోంది... మూసలో ప్రాణం పొయ్యాలనుకుంటూ హను మాయమ్మ భర్త సాంబశివరావు స్త్రీ అరవై మూడు — తరువాత మరొకటి — మరొకటి. మూసకాస్తా ముక్కలయి పోయింది. కలలో విరిచి ఎగిరిపోయింది. స్కూలు పాఠం— ప్రైవేటు... జాబితా... పాతిక వాట్ల వెలుతురు.

పేరు కింద పేరు. పేరు కింద పేరు. ఓటర్ల జాబితా... ఇది ప్రజాస్వామ్యానికి వెన్నెముక... మరో పేరు...

—"ఏవండీ! ఆవిడ...పిన్నిగారొచ్చారు.."

"ఎవరే పిన్నిగారు..." ప్రసాద్ తల పైకెత్తి టేబిలుమీద అలారం వాచీ ముఖం చూశాడు. తొమ్మిది కావస్తోంది.

టేబిలు—కుర్చీ కంటే ప్రసాదుకి నేలే బావుంటుంది. నేలమీద ఉండడమే ఘనతన్న భావనొకటి... కుర్చీ నేలకంటే ఎత్తన్న భయమొకటి.

"ఆ రండి! రండి ఇంత చీకటిలో వచ్చారు!"

"వీధి దీపాలు అన్నీ వెలుగుతున్నాయి... ఏంలేదు నాయనా... ఆ నాలుగో వీధి కమ్యూనిటీ హాలుకు రేపు సాయంకాలం మేష్టరుగారిని రమ్మన్నారట... నువ్... నేనూ వస్తాననుకో... కొంచెం సాయం..."

"వివరాలు మాష్టారినే అడుగుతా ఉండండి!" ప్రసాద్ లేచి చొక్కా తొడుక్కొని బయలుదేరాడు...

"వికలాంగుల సంవత్సరం కదా ... రేపు వికలాంగుల దినంట. రెవిన్యూ ఇన్‌స్పెక్టర్ నన్ను కలెక్టరుగారు అక్కడికి రమ్మన్నారని వచ్చి చెప్పాడు. కాగితం పెట్టమంటే పెట్టాను...ప్రభుత్వం మా కోసం చేస్తున్నది వద్దనడమెందుకు, పాతికోపరకో ఇస్తారేమో, ఫోటోలట — డాక్టర్ సర్టిఫికేటలు అన్నీ పంపించాను ఓ శిష్యుడు వచ్చి చెబితే... నీకు అయిదింటికి తీరిక అవుతుందా ?"

"తప్పకుండామాష్టరూ...నేనో పావుగంట ముందేవచ్చి మిమ్మల్ని తీసుకెళతాను."

ఇంటికివచ్చి తను రాసిన కథ మూస చూసుకున్నాడు. సామాజిక స్పృహ తో నిద్దరొచ్చి లైటార్పి పడుకున్నాడు.

మరుసటి రోజు సాయంకాలం స్కూలు నుంచి నేరుగా మాస్టారు ఇంటికే వెళ్ళాడు. ఆయన గదిలోంచి అరుగుమీదికి, మెట్ల కిందకీ దేక్కుంటూ వచ్చి రిక్షా మీద కూచోబెడితే కూచున్నారు.

కమ్యూనిటీ హాలు ముందు కార్లూ, కోలాహలం. హాల్లో కుర్చీలు వేయించి అనేక రకాల వికలాంగులను బొమ్మల కొలువులా పేర్చారు.

వేదిక మీద కలెక్టరుగారూ, అధికారులూ పెద్దలూ, వికలాంగుల కష్టాలూ, వారి ఎడల సమాజం యొక్క బాధ్యతా, ప్రభుత్వం వారి ఆరాటం ప్రసంగాలయ్యాయి.

ఎవరో ఓ చీటీ ప్రసాద్‌కి అందించారు మేష్టరు కియ్యమని. అది ప్రసాదే ముందు చూశాడు. 'మీరు మాట్లాడాలని మనవి' — " కలెక్టరుగారిచ్చారట మీకు " — ప్రసాదు అందించాడు.

మైకు విశ్వనాథంగారి ముందుంచారు — ఆయన గొంతు విప్పి చెబుతున్నారు.

"అవిటి వాళ్ళమని చచ్చిపోవడం లేదు. బ్రతుకుతూనే ఉన్నాం. ఎలాగో తింటూనే ఉన్నాం. మన బ్రతుకుల్ని మనం బండో బరువో ఎలాగోలాగ ఈడ్చుకుంటున్నాం. అయితే మన కష్టాలను ఇతరులు కవంత గుర్తించి మన ఎడల కించిత్ సానుభూతి అవగాహనా చూపి మన మనుగడని గుర్తిస్తే మన కదే పదివేలు. సమాజానికి మన మెవరమూ గుదిబండలం కాకూడదనే విన్నపం...ప్రజాస్వామ్యం మనం ఏరి కోరి తెచ్చుకున్నాం, సంక్షేమ రాజ్యం కట్టుకున్నాం. ప్రజా ప్రభుత్వం కాగితాల మీద నుంచి, వేదికల మీది నుంచి దిగి మన మనుషుల్లోకి, మనుష్యుల మనసులలోకి రావాలి. అది వస్తోందనడానికిదే నిదర్శనం. ఈ సంతోషం మీ అందరితో పంచుకుంటున్నాను. నా కింత వయసొచ్చింది...బ్రతుకంతా అవిటి వాడిని కాను...కాని ఈ రోజు, ఈ క్షణం నా బాధ ఏ నాడూ నేను పడనంత బాధ. ఇంతమంది బాధపడుతున్న వాళ్ళిక్కడే ఉన్నారని నాకు తెలియదు ...

మిమ్మల్ని చూస్తుంటే నాకు మనస్సు తరుక్కుపోతోంది ... ప్రభుత్వ మన్నది ఒక ఊహ. ఒక భావన — ఒక యాబ్‌స్ట్రాక్షన్ అంటారు దొరలు — అదే కాదు. ప్రభుత్వం అంటే మనుషులు. ప్రభుత్వమంటే అధికారులు కారు. విందుచేతనంటే ఎంతటి అధికారయినా ముందు మనిషి తరువాతే అధికారి... అవిటి వాళ్ళని చూసి జాలిపడి మనం చెయ్యగలిగిన పనులు మనకు ఇవ్వాలి. దేశమంటే మాకూ భక్తి ఉంది. మేం చెయ్యగలిగినది మమ్మల్ని చెయ్యనివ్వండి. పని ఇయ్యమనే మనం అడుగుదాం, భిక్షం వెయ్యమని కాదు. ఆ దశకు అతీతంగా






బులుసు వేంకటరమణయ్య

## ప్రబోధ శక్తి

ఉత్తములు ఇతరుల బాగు కోరి మంచి పద్ధతులను బోధిస్తారు. ఇతరులు పై వారిని చెడ్డ మార్గంలో దింపడానికే ప్రయత్నిస్తారు. సత్ప్రబోధం కంటె దుష్ప్రబోధానికి శక్తి ఎక్కువ. మంచి ప్రబోధం చాలా నిదానంగా గాని పని చెయ్యదు. చెడ్డ ప్రబోధం స్వల్పకాలంలోనే తలకెక్కి మనిషిని మార్చివేస్తుంది. రోగికి మంచి మందయినా పని చెయ్యడానికి కొంత ఆలస్యం కావచ్చును. కాని విషం దృఢ కాయునికయినా ఒక క్షణంలో ప్రాణాలను తీసివెయ్యగలదు. అందువల్ల దుష్ప్రబోధానికి లొంగకుండా ఉంటేనే క్షేమం కలుగుతుంది. లొంగిపోతే హాని తప్పదు.

కైక సంగతి చూడండి. ఆమెకు తన కుమారుడు భరతుని కంటె రాముని యందే వాత్సల్యం, అభిమానం అధికం. దశరథుని ముగ్గురు భార్యలకు ఏమాత్రం ఎరుసు లేదు. దశరథునికి లభించిన పాయసాన్ని ముగ్గురూ పంచుకున్నారు గదా!

రాముని పట్టాభిషేక వార్తను విని ఆమె వింతగానో పొంగిపోయింది. తన కుమారుని పట్టాభిషేకంగానే భావించింది. కాని, తన దాసియైన మంధర దుష్ప్రబోధం వల్ల ఆమె పూర్తిగా మారిపోయింది.

తుమ్మెద ఒక పురుగును తెచ్చి తన గూటిలో ఉంచి, ఝుంకారం చేస్తూ దాని చుట్టూ తిరిగితే కొంతకాలానికి ఆ కీటకం భ్రమరమై పోతుందని అంటారు. దీనినిబట్టే భ్రమరకీట న్యాయం ఏర్పడింది. ఆ విధంగానే మంధర చేసిన ఎడతెగని ప్రబోధం వల్ల కైకలో—అనుకోని గొప్ప మార్పు వచ్చింది.

కైక మొదట్లో మంధర బోధనలను చెవిని పెట్టలేదు. కాని ఆ దుష్టురాలు చెవిని ఇల్లు కట్టుకొని ప్రబోధించినది. రాముడు రాజయితే కౌశల్యదే సర్వాధికారమనీ, కైక ఆమె చెప్పుచేతలలో మెలగవలసి వుంటుందనీ విషభావాలను బాగా తలకెక్కించినది. ఇందులో స్వార్థం కూడా ఉన్నది. ఇప్పుడు కైకకు ప్రాభవం ఎక్కువగా ఉన్నందువల్ల — ఆమె దాసి మంధర దాసీ జనానికి అధికారిణిగా ఉన్నది. కైక ప్రాభవం తగ్గిపోతే తన అధికారం తగ్గిపోతుంది. ఏ దాసీ కూడా తన్ను లెక్కచెయ్యదు. భరతుడే రాజయితే ఆ చిక్కు లేదు. మంధర స్వార్థం ప్రభుత్వాన్నే తల్లక్రిందులా చేసింది. దుష్టుల కుయుక్తులు ఎంత పనినైనా చెయ్యగలవు. వారి ప్రబోధాలకు లొంగకూడదు. ★

---

బ్రతకాలనే—మా కంటె బాధపడే మనుషులకు అండగా ఉండాలనే మా ఆవేదన — మనందరి ఆవేదనా. మాకు అందరిలాగే జీవించాలని ఆశ ఉంది ... మా మనసులు అవిటివి కావు...''

తెలుగు కష్టపడి నేర్చుకున్న పంజాబీ కలక్టరుగారు ముందుకు వంగి వింటున్నారు. పెన్ను తీసి కాగితం మీద ఏదో రాశారు. వెనుక మంచి తాసిల్దారు గారు కాబోలు ఓ ఫైలు అందించాడు. కలెక్టరుగారు మరేదో రాశారు ... తాసిల్దారు గారికి చెమట పడుతోంది. విశ్వనాథంగారు మాట్లాడడం ముగిస్తున్నారు.

''మమ్మల్ని మనుష్యులుగా గుర్తించాలను కున్న సమాజానికీ, ఆ సమాజం ఏర్పరచు కొన్న ప్రభుత్వానికీ, దానిని నడుపుతున్న అధికారులకీ, అధికారంలో ఉన్న మనుష్యులకీ మా అందరి తరఫునా ధన్యవాదాలు చెబుతూ నా కిచ్చిన అవకాశానికి కృతజ్ఞత చెప్పుకుంటూ

## రాయాల్సినకథ

సెలవు...''

మైక్ వేదిక మీదకు వెళ్ళింది.

కలక్టరుగారు ముందు విశ్వనాథంగారి పేరే పిలిచారు. ఓ పదిమంది ఆ మనిషిని సాదరంగా వేదిక మీదకు చేర్చారు.

విశ్వనాథంగారు స్వయంగా తన చేతులతో నడుపుకోగలిగే మూడు చక్రాల సైకిలుకు అమర్చిన కుర్చీ.

ప్రభుత్వం దానిని ఆయనకు అందిస్తున్న కానుకగా కలక్టరుగారు దానిని అభివర్ణించారు. ఆయన సొంతంగా చెయ్యి ఊతిక ఇచ్చి విశ్వనాథంగారిని కుర్చీ బండీ మీద కూర్చో బెట్టారు. వెనకాల అందరూ నుంచొని ఫొటోగ్రాఫర్ వంక చూస్తున్నారు. మునిసిపల్ కమీషనర్ గారు విశ్వనాథంగారి భార్యను ఫొటోలోకి రమ్మన్నారు.

—''ఇదేదో సన్మానంలా చేశారోయ్! దానం పట్టినట్టు లేదు నాకు'' — ఇంటికి వస్తూ అన్నారు విశ్వనాథంగారు.

ప్రసాద్ ఇంటికి వచ్చి తన మూస వంక చూసుకొని ఆలోచనలో పడ్డాడు. రాయాలని పించిన మాట నిజం. రాయాలనిపించిన తరువాత...రాసింది వేరు...

రచయితగా సామాజిక నిస్పృహలో మంచి స్పృహలోకి ఎదిగి — కాకపోతే మేల్కొని — మరుసటిరోజు మరో విషయం తెలుసు కున్నాడు.

సొంతంగా నడుపుకునే సైకిలు కుర్చీ అసలు ముందు ఎవరికి ఉద్దేశింపబడిందంటే ... ఓ అంధుడికి ... అదే తాసిల్దారుగారి తత్తరపాటుకీ, చలికాలంలో చెమటకీ కారణం ...కలెక్టరుగారు దాన్ని అక్కడికక్కడ మార్పు చేసి విశ్వనాథంగారికి ఇచ్చారు.

తాసిల్దారు వెనుక కథలోకి వెళ్లదలుచుకో లేదు ప్రసాద్—సామాజిక నిస్పృహకి జారిపడి పోడం ఇష్టంలేక. ★



## మానభంగం—దొంగతనం

మెట్టూరుకు చెందిన 16 ఏళ్ళ ఈశ్వరి తన తండ్రితో వుంటోందట. మొన్న జులై 31 న ఆమె తండ్రి పెద్ద కూతురును చూడడానికి కావేరి పట్టణం అనే వూరు వెళ్లేసరికి ఈశ్వరి ఆ రాత్రి పక్కింటివారి పిల్లను తోడు తెచ్చుకుని పడుకున్నదట. ఆ రాత్రి మాదు, సెల్వముత్తు, అమాసి అనే ముగ్గురు ఆమె యింట్లో జొరపడి ఈశ్వరి నోట్లో గుడ్డ కుక్కి, ఆమెను మంచంమీద పడేసి ఇద్దరు ఆమెను గట్టిగా పట్టుకుంటే మూడో వ్యక్తి ఆమెతో తన కామదాహం తీర్చుకున్నాడట. ఈవిధంగా ఆ ముగ్గురూ మార్చి మార్చి తమ కామ దాహాలు తీర్చుకుని, పోయేటపుడు ఇంట్లో వున్న రెండు వేల రూపాయలు ఎత్తుకు మరీ పోయారట

## డబ్బుకోసం కోడలినితార్చినఅత్త!

మద్రాసులో వో మహా యిల్లాలు తనకున్న గుర్రప్పందాల వ్యసనానికి డబ్బు లేక, ఉపాయాంతరమూ, మార్గాంతరమూ తోచక తన కోడలిని బలవంతపెట్టి, బెదిరించి వో విటునికి వప్పగించి ఆతడిచ్చిన డబ్బుతో గుర్రప్పందాలకు ఎగురు కుంటూ వెళ్ళిందట. ఈవిడ పేరు ఏ పత్రికా బయట పెట్టలేదు.

## ముఖ్యమంత్రి చుట్టాన్నంటూ మోసం చేసిన మహిళ!

బెంగుళూరులో వో వన్నెల విసనిక్ర విస విసా నడుచుకుంటూ వో బట్టల షాపుకు వెళ్లి అతి ఖరీదయిన చీరలు దింపించి నేను ముఖ్యమంత్రిగారి ముఖ్య చుట్టాన్ని. ఈ చీరలు అమ్మగారు కావాలన్నారు చూపించి వస్తాను అని చెప్పి నామీద నమ్మకంలేదా, ఆ ఫోనిలా అందుకోండి మాట్లాడుతాను. మీరే నంబరు తిప్పి నాగరత్నం గారు మాట్లాడుతారని చెప్పండి అని ఆ షాపు వారిని అదరకొట్టి బట్టలు తీసుకుని చల్లగా జారుకుందట చివరికిది మోసమని తేలిందట— నారీమణు లెందున తక్కువ! మరి ఒప్పుకోరే!

## ఈతరానిపోలీసులని ఏమార్చిన సైకిల్ దొంగ?

సత్తెనపల్లిలో సోమారావు అనే వో సైకిలు దొంగను పోలీసులు అతి నేర్పుగా పట్టి మొన్న జులై 24 వ తేదీన కోర్టుకు తీసుకు వస్తున్న సమయంలో కాలవ గట్టు ప్రాంతాని కొచ్చే సమయానికా సోమారావు లఘుశంక అంటూ చిన్నవేలు చూపాడట సరి వెళ్ళిరా అంటే గట్టు గిగి, కాలువలో దూకి మునుగు యీత, తేలుయీత కొట్టుకుంటూ పారి పోయాడట ఏ యీతారాని ఆ పోలీసు లిద్దరూ ఒడ్డున శాంపీలు, కథాకళి, భరతనాట్యాలు చేశారట.

## బిత్తరబోయిన బిల్ కలెక్టరు!

షిమోగాకు చెందిన దానప్ప ముల్కి అనే వో బిల్ కలెక్టర్ తన విధిని నిర్వహించి ఆఫీసుకు వెళ్తుండగా, దారిలో ఒహోయ నాతన్ని నిలిపి, ఎన్నాళ్ళకు కన్పించావు దానప్పా అంటూ అతి గాడంగా కౌగలించుకుని, చుపుక్కునోముద్దు పెట్టుకుని, వెళ్లొస్తానని వచ్చినంత వేగంగానూ అంతర్ధానమైపోయాట్ట. తేరుకున్న దానప్ప దీనర్థమేమబ్బా అని ఆలోచించి నిశ్చేష్టు డయ్యాడట్ట. ఆ ఆగంతకుడు దానప్ప జేబులోవున్న అయిదొంద రూపాయలూ పుట్టున కాజేసుకుని, బదులుగా వోముద్దిచ్చి పోయాట్ట—చత్తేరీ! పోనీఅయిదొందలెట్టి ముద్దు కొనుకున్నామనుకోడానికా యిచ్చింది కవీసమో నారీమణి అయినా కాదుకదా!

## గురక పెట్టడం గుండెకి ప్రమాదం!

బ్రిటన్ నేషనల్ యూడార్ హాస్పటలుకు చెందిన డాక్టరు డేవిడ్ హెడ్జెట్ గురక మనుషుల ఆరోగ్యానికి చాలా హానికరమనీ, ముఖ్యంగా మగవారికి అస్సలే పనికిరాదనీ, గుర్రు పెట్టే పురుషునిలో పుంసత్వం తగ్గిపోతూందని అన్నారట. గురక ద్వారా రక్తంలో చేరాల్సిన ఆక్సిజను నిష్పత్తి తగ్గిపోతూందనీ, దాంతో గుండె బలహీనమయి కూర్చుంటుందనీ ఆయనన్నారట. "తస్మాత్ ఎవాయిడ్ సౌండ్ స్లీప్"

## రైలుపెట్టెలో దంపతులపై దౌర్జన్యం!

గోపాలన్ అనే ఆయన, ఆయన భార్య అన్నపూర్ణ మద్రాసునుంచి భోపాలు వెళ్లి అక్కడ భోపాలునుంచి ఇండోర్‌వెళ్లే రైలు 12 వ తేదీ రాత్రి ఎక్కారట ఆ మొదటిపెట్టి చీకటిగా వుండడం వల్ల వో మూల కూర్చున్నారట, రైలు బయల్దేరితే లైట్లు వేస్తారన్న ఆశతో ఈలోగా వో యిద్దరు దుండగులు ఆ పెట్టిలో ప్రవేశించి, కత్తులతో వారిని గాయపరిచి, అన్నపూర్ణ మెడలో మంగళసూత్రం, మరో రెండు గొలుసులూ పీక్కు చక్కాపోయారట వాటి ఖరీదు సుమారు పదివేలట వారిద్దరినీ భోపాల్ ఆసుపత్రిలో చేర్చారట చికిత్సార్థం పోలీసులు.

## కుటుంబనియంత్రణ లెక్కలు!

గత సంవత్సరం (1981— 82 ఏప్రియల్— మార్చి) కుటుంబ నియంత్రణ వల్ల భారతదేశంలో యాభైయొక్క లక్షల పుట్టుకలను నిలపడం జరిగిందట. ఈ సంవత్సరంలోనే ఆడా మగాకు స్టెరిలైజేషను ఆపరేషన్లు 27,84,436 కచ్చితంగా జరిగాయట. అదే గాకుండా సుమారు 130 లక్షల మంది కుటుంబ నియంత్రణ పథకం సామగ్రులు వాడినట్టు లెక్కలు తేలాయట— ఇందులో వివాహంకాని వారు ఎంతమందో!






# భారతదేశమంతటా డీలర్ల విశ్వాసాన్ని పొందిన చిహ్నం



**neelam®** STAINLESS STEEL TABLEWARE



**ANJALI®** Kitchenware



**RAMA** STAINLESS STEEL WARE



**SWAN** ELECTRICAL APPLIANCES



**MAJESTIC®** Kitchenware



NOVELTIES & FEEDING BOTTLE WARMER



**amar** GASLITER AND MUSICAL TOY



**MAJESTIC®** Pressure Cooker



**Hawkins®** PRESSURE COOKER



**Ajanta** KWALITY KITCHENWARE



**Supercook** GAS TANDOOR



**flora®** KITCHEN AIDS



**Bindal's** THERMAL TEA JAR



**NIRLEP** NON-STICK COOKWARE



**Priya** ICE PAIL & HOT CASE



**Kitchenmate** COOK'N'SERVE WARE



**CRYSTAL®** ELECTRONIC GAS LIGHTER



**MAJESTIC®** WATER FILTER



ఆంధ్రప్రదేశ్‌లోనే 650 మందికి పైగా డీలర్లు విశేష లాభాలకు దానిని చిహ్నంగా కనుగొన్నారు. ఎందుకంటే,
అతి ఎక్కువగా అమ్మకమయేవి • వంట పాత్రలు • స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు • ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్
అప్లయన్సెస్ • బహుమతులివ్వడానికి పనికివచ్చే కొత్త కొత్త రకాలు దానికింద పంపిణీ అవుతున్నాయి.
అంటే భారీగా మరియు తేలికగా అమ్మకాలు-కాబట్టి లాభాలు ఎక్కువ
మంచి వ్యాపారం కోసం మీరు నిరీక్షిస్తున్నట్లయితే, డీలర్‌షిప్ కొరకు రాయండి. ఆంధ్రప్రదేశ్
అంతటినుండి డీలర్‌షిప్ కొరకు దరఖాస్తులు కోరబడుచున్నవి.

allied



ఆంధ్ర ప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు

**మహావీర్** ఎంటర్ ప్రైజెస్, తిలక్ రోడ్, హైద్రాబాద్-1

PH : 221198/34819

# దాంపత్య సంగీతం

సీరియల్

శ్రీమతి కళ్యాణీ సోమరాజ్

శారద తరువాత రెండురోజుల వరకు కన్పించ లేదు బహుశా జ్వరం తగ్గిందేమో! అను కున్నాను కాని బయట ఎక్కడా ఆమె కన్పించకపోయే సరికి అనుమానం తీరలేదు ఆ రోజు సాయంకాలం కుమార్ పేషెంట్స్‌ను చూస్తూ చాలా బిజీగా వున్నాడు ఈ మధ్య అతని పేషెంట్స్ బాగానే వస్తున్నారు ఆ చుట్టుపట్ల మరో క్లినిక్ లేక పోవటం వలననో, కుమార్ ఫీజ్ గురించి మరి పట్టించుకోకవలననో, కొన్ని మొండికేసులు నయం చేయటం వలననో, మొత్తానికి అతని పేరు ఆ పేటలో అందరికి తెలిసింది

నేను మెల్లగా శారదవాళ్ళున్న పోర్షన్ వైపు వెళ్ళాను అప్పుడే శారదభర్త రామ్మూర్తి వీధి తలుపు విసురుగా లాక్కుంటూ వెళ్ళిపోవటం చూసి, ఆగాను మనిషి దృఢకాయుడులా వున్నాడు శారద అతని పక్కన మరీపీలగా చిన్నపిల్లలా వుండొచ్చు అన్పించింది

నేను తలుపుమీద చిన్నగాతట్టి లోపలికి అడుగు పెట్టాను ముందుగదిలో రెండు కుర్చీలు వేసి వున్నాయి నేను చొరవగా లోపలికి వెళ్ళాను శారద మంచంమీద పడుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది నా అలికిడివిని తలెత్తి నన్నుచూసి ఖంగారుగా లేచి కూర్చుని "రండి, డాక్టరుగారు" అంటూ గబగబా చీరకొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంది

"మళ్ళీ మీరు అటువైపు రాలేదు జ్వరం తగ్గిందేమో చూసి పోదామని వచ్చాను ఏమిటలా వున్నారు" అంటూ ఆమె నుదురు తాకిచూశాను చుర్రునకాలింది "మందులేవి వాడలేదా!" అన్నాను బహుశ నూటమూడు పైన వుండచ్చు ఆమెకు టెంపరేచర్

" " ఆమె దోషిలా తలవంచుకుంది

"ఎందుకు మందు వేసుకోలేదు ఇలా అయితే జ్వరం ఎలా తగ్గుతుంది" అన్నాను మందలింపుగా!

"నాకు జ్వరం తగ్గక్కర్లేదు డాక్టర్ ఇలాగే చచ్చిపోవటానికి మందు ఏదైనా ఇవ్వండి" అంది శారద దిండులో ముఖం దాచుకుంటు

నాకు శారద పరిస్థితి అర్ధంకాలేదు అలా అని ఆమెనలా చూస్తూచూస్తూ వదిలి వెళ్ళిపోవాలనిపించ లేదు

"మీరు దేనికో చాలా బాధపడుతున్నారు జనాన్ని చంపటానికి కాదుకదా మేము ఇంత కష్టపడి చదువు చదివింది! చెప్పండి శారద ఏమిటి మీ బాధ? నేను మీ అక్కలాంటిదాన్ని అనుకోండి మిమ్మల్ని చూస్తుంటే మా చెల్లెలు గుర్తు వస్తోంది దానిపేరు శారదే అయితే అది మీ అంత నెమ్మది



(గత సంచిక తరువాయి)

కాదు చాలా గడుసుపిల్ల" అన్నాను ఆమె దుఃఖాన్ని మరపించాలన్నట్లు

"నాతో ఎవర్ని పోల్చకండి, నేను దురదృష్టవంతురాలిని మీరంతా ఆపేక్షగా మాట్లాడుతుంటే మా వాళ్లను చూస్తున్నంత ఆనందంగా వుంది అప్పుడే వాళ్ళను చూసి మూడు నాలుగేళ్ళు దాటు తోంది" అంది దుఃఖాన్ని నిగ్రహించుకుంటూ

"అదేం చాలాదూరంగా వున్నారా మీ వాళ్ళు?"

"లేదు దగ్గరలో వున్నా చాలా దూరమై పోయాను నా పెళ్ళితోనే నా వాళ్ళకు నాకు సంబంధం తెగిపోయింది"

"అదేం!" బహుశ మాలాగా వాళ్ళ పెళ్ళి పెద్దవాళ్ళకి ఇష్టంలేదేమో! అనుకుంటూ

శారద చెప్పసాగింది—"మా నాన్నగారు స్కూల్ టీచర్ మేము మొత్తం ఆరుగురు సంతానం అందులో నలుగురు ఆడపిల్లలు – ఇద్దరు మొగ పిల్లలు ఆడపిల్లలు పెద్దవాళ్ళవటంచేత నాన్నగారికి మగపిల్లల చదువు సమస్యకంటే ఆడపిల్లల పెళ్ళిళ్ళ సమస్యే ఎక్కువ బాధించేది నాన్నగారికొచ్చే కొద్ది జీతం, అమ్మ మేము ఆ పని, ఈ పని చేసి సంపాదించే డబ్బుతో మా పొట్టలు హానీ హానీగా నిండేవి

---

**జరిగిన కథ — 4:** కాంట్రాక్టర్ రామనాధంగారి కూతుళ్లు స్వాతి, శారద భార్య గుండెజబ్బుతో మరణిస్తుంది స్వాతి ఎం బి బి యస్ ఆఖరి సంవత్సరం పరీక్షలు రాసింది శారద బి ఎ చదువుతున్నా చదువుకంటే సంగీతానికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తుంది ఎం ఎస్ పూర్తిచేసిన కుమార్‌తో లోగడ తనకి తెలియనివి చెప్పించుకొనేది స్వాతి ఆ విధంగా వారిద్దరూ దగ్గరవుతారు చదువు పూర్తి చేసుకొని కెనడానుంచి వచ్చిన సురేంద్రతో స్వాతి వివాహం అతను అక్కడికెళ్ళేముందే నిర్ణయిస్తారు రామనాధంగారు. కుమార్‌ని పెళ్లి చేసుకొంటానన్న స్వాతి మాటలను లెక్కచెయ్యకుండా సురేంద్రతో ఆమె పెళ్లి ఖాయం చేస్తారు రామనాధంగారు స్వాతి, కుమార్ వివాహం చేసుకొని విశాఖపట్నంలో కాపురం పెడ్తారు స్వాతి ఫస్ట్‌క్లాసులో పాసవుతుంది. అక్కడే హౌస్ సర్జన్ చేస్తుంటుంది కుమార్ ఇంటి ఓ భాగంలో ప్రాక్టీస్ ప్రారంభిస్తాడు స్వాతికి మామితో పరిచయం కల్గుతుంది. ఆ బిల్డింగ్‌లోనే అద్దెకుంటున్న శారద జ్వరంతో స్వాతి దగ్గరకు రాగా, మందులు ఇచ్చి ఫీజు తీసుకోదు

---

మా అక్కకి పాతికేళ్ళు దాటుతున్నా పెళ్ళి చేయలేదు. చుట్టుపక్కల వాళ్ళు మమ్మల్ని ఆడిపోసుకొనేవాళ్ళు ఆ మాటలు విని అమ్మ తన అశక్తతకు కుళ్ళి కుళ్ళి ఏడ్చేది నాన్నగారు చేసేదేమిలేక దైవంమీద భారం వేసేవారు అలాంటి సమయంలో మధ్యవర్తుల ద్వారా నాన్నగారికి ఈయిన సంబంధం చెప్పారు కట్నం నాన్నగారు రెండువేల కంటే ఎక్కువ ఇవ్వలేనని, పెళ్ళి కూడా ఆర్భాటంగా చేయలేనని చెప్పారు అన్నిటికి సిద్ధమై అక్కను పెళ్ళి చేసుకోటానికి సమ్మతి తెలియపరచారు వాళ్ళు కాని పెళ్ళి ఇంకా నాలుగు రోజులుండనగా ఆడబడుచులాంఛనాలు, పెళ్ళి కొడుక్కి వెండికంచం, చెంబు కావాలని పేచిపెట్టారు నాన్నగారు ఇవ్వలేనని నిర్మొహమాటంగా చెప్పారు దాంతో పెళ్ళి ఆగిపోయింది ఈ అవమానం భరించ లేక అక్క రైలుకింద తల పెట్టింది తరువాత నెల రోజులకు మా అక్క చనిపోయిందన్న విషయం తెలుసుకొని కాబోలు, మీ రెండో అమ్మాయి నైనా చేసుకుంటాం మాకే లాంఛనాలు వద్దు అని కబురు చేసారు నాన్నగారికి ఇష్టం లేకపోయినా, మా ఆర్థిక సమస్యను దృష్టిలో వుంచుకొని సరే నన్నారు ఆ విధంగా ఈయన ఇల్లాలి నయ్యాను

ఇప్పుడు అనిపిస్తూ వుంటుంది, అక్క చనిపోయి చాలా అదృష్టవంతురాలైందని నేను బ్రతికుండి రోజుకో నరకాన్ని చూస్తున్నాను పెళ్ళి అయి ఇన్నాళ్ళైనా, నాన్నగారు తనకి ఇవ్వవలసిన లాంఛనాలు ఇవ్వలేదని, పండక్కి, పబ్బానికి పిలిచి మాట్లు కుట్టించలేదని ఏదోవిధంగా నన్ను సాధిస్తారు ఈయన నా వాళ్ళకు ఉత్తరాలు వ్రాయ కూడదు, వాళ్ళ పేరు తలవటమే నిషేధం ఎప్పుడైనా బదులు చెబితే గొడ్డును బాదినట్లు బాదటం నాదీ ఒక బ్రతుకంటారా" చెప్పటం ఆపి శారద నా వంక చూసింది. చెంపకు చేయి ఆన్చి ఆమె చెప్పేది అంతా శ్రద్ధగా వింటున్న నేను, శారద హఠాత్తుగా అడిగేసరికి ఏమనాలో తెలియలేదు వయసులో నా కంటే ఆమె చిన్నదైనా ప్రపంచాన్ని చాలా చదివిందిలా అన్పించింది మగవాళ్లలో రామ్మూర్తి లాంటి వాళ్ళు వుంటారన్నదే నా కింతకు ముందు తెలియదు అందుక్కారణం ఐశ్వర్యంతో, అంతస్తుతో మిగిలిన ప్రపంచానికి చాలా దూరంగా పెంచారు, నాన్నగారు నా చిన్న ప్రపంచంలో నాకు పరిచయమైన కొద్ది మంది చదువు, సంస్కారం వున్న పురుషులే!

"ఏమిటక్కా! ఆలోచిస్తున్నారు"

"ఏం లేదు నీ జీవితాన్నేమైనా బాగు చేయ గలనేమో అని"

"హుం. అది ఈ జన్మలో కాని పని నేనిలా ఏడుస్తూ బ్రతుకు నీడవ్వలసిందే"

"అది సరే ఇప్పుడు ఏమొచ్చింది హరాత్తుగా మీ ఇద్దరి తగువుకి"

"వారం రోజుల క్రితం మాతమ్ముడు వచ్చాడు మా చెల్లిలి పెళ్ళికుదిరిందట ఈ విషయం చెప్పి నన్ను పంపమని ఆయన్ను అడిగాడు అందుకు ఆయన, వాడిని నానామాటలు అని పంపారు నాన్న గారు రిటైరయ్యారుట ఎలాగో అవస్థపడి మా చెల్లెలికి పెళ్ళి చేద్దామని వాళ్ళు అనుకుంటుంటే, ఈయన తన కివ్వాల్సిన లాంఛనాలు అంటూ ఇప్పుడు



పేచీలు పెట్టుకుంటే బాగుంటుందా ? ఆ మాటే ఒళ్ళుమండి నేను అనేసరికి బెల్టు వుచ్చుకొని నన్ను కొట్టారు " శారద చేతుల్లో మొహం దాచుకొని బావురుమంది

శారద దుఃఖం ఉపశమనం అయ్యే వరకు అలాగే చూస్తూ కూర్చున్నాను కేవలం పొడి మాటలతో ఆమె బాధ తీర్చగలిగేది కాదనిపించింది

"శారదా ! నా మాటవిని నువ్వు నేను ఇచ్చే మందులు అవీ వుచ్చుకొని ముందు జ్వరం తగ్గించుకో ! నువ్వు బాగా కోలుకున్నాకా అప్పుడు నీ భవిష్యత్ గూరించి ఆలోచిద్దాం అందాక ఏ ఆలోచన పెట్టుకోకు ప్లీజ్ నా మాట విను" అంటూ ఆమెను అనునయించి, ఓదార్చే సరికి చాలా సేపు పట్టింది

* * *

ఆర్థర్ హేలీ వ్రాసిన ఫైనల్ డెమాగ్నిస్ చదువుతున్నాను నిజానికి ఆ పుస్తకం చదవటం రెండోసారో మూడోసారో ! నాకు నచ్చిన నవల్సులో అదొకటి

కుమార్ అతనిక్కావాల్సిన మందులేవో కొనా లంటూ బజారు వెళ్ళాడు ఏమీ తోచక పుస్తకం తెరిచాను

ఇంతలో మామిరావటం గమనించి నవ్వుతూ ఆహ్వానించాను

"ఎన్నమ్మా ! వూరికే కూసింటేరా !" అంది మామి లోపలికి వస్తూ

"ఔను మామి "

"తంబి లేడా !"

"లేరు బయటకు వెళ్ళారు"

"అయితే నాతో కూడ సినిమాకి వచ్చేవా తిరువెళయాడల్ రొంబ బాగుంటుంది "

"నేనా!" అన్నాను ఖంగారుగా అసలే సినిమాల మీద నాకున్న ఇంట్రెస్టు అతి తక్కువ దానికి తోడు తమిళ సినిమానా !

"అయ్యర్ ఆఫీసుకుదా పోయారు ఎవ్వరు కూడా వచ్చేదిలేదు నీవు వస్తావా అని అడిగాను "

మామికి చూస్తూ చూస్తూ 'రాలేను' అని చెప్ప లేక పోయాను "సరే మామి" అంటూ రెండు నిముషాల్లో రెడీ అయివచ్చాను కుమార్ దగ్గర డూప్లికేట్ ఎప్పుడు వుంటుంది కాబట్టి, ఇంటికి తాళం పెట్టి మామి వెంట బయలుదేరాను

సినిమాకి అట్టే జనం రాలేదు మామి వద్దంటున్న వినకుండా నేనే టిక్కెట్లు తీసుకున్నాను సినిమా అప్పటికే మొదలు పెట్టడంతో మామి ఖంగారుగా లోపలికి పరుగుతీసింది నేను సినిమాహాల్లో కూర్చున్న మనసు మాత్రం ఎక్కడెక్కడో విహరిస్తోంది కుమార్ ఇంటికి రాగానే నేను కన్పించక పోతే ఏమనుకుంటాడో ఒకవేళ కుమార్ కంటే తనే ముందు వెళితే ఏదైనా అతని కోసం టిఫెన్ చేయాలి ఏంచేయాలబ్బ కుమార్ ఉప్మా, పూరి, పకోడ మాత్రం నేర్పాడు ఉప్మా చేద్దామంటే కరివేపాకు లేవు కాబోలు ఇంట్లో పోని మామి దగ్గర రెండు ఆకులు తీసుకుంటే "మామి కరివేపాకులున్నాయా !" అన్నాను హఠాత్తుగా

మామి ఖంగారుగా నావంక చూసి "నిద్ర పోతున్నావా అమ్మాణ్ణి" అంది

"లేదు మామి నిజంగానే అడుగుతున్నాను"

"ఇప్పుడెందుకని"

"ఇంటికెళ్ళాక తీసుకుంటాను "

"సరే ముందు సినిమా చూడు శివాజి గణేశన్ శివుడుగా అందంగా లేదు "

''శివుడా ఇందాక కబ్బేలు అమ్ముతున్నాడులా ు ది''

''అబ్బె అదంతా భక్తుల కోసం వేషం అంతే'' అంటూ భక్తిగా మళ్ళీ సినిమాలో లీనమైంది మామి

ఆ తరువాతనైనా సినిమా చూద్దామని నేను చేసిన ప్రయత్నం విఫలమైంది మొత్తానికి ఎలాగో సినిమా అయిందని లేచాం సినిమా హాలు ఇంటికి దగ్గరే అవటంతో ఇద్దరం కబుర్లు చెప్పకుంటూ నడక సాగించాం మామి సినిమా గురించి పావుగంట పొగిడి, తమ అయ్యారు పెళ్ళి అయిన కొత్తల్లో ఎలా సినిమాలకి వెళ్ళేవాళ్ళో చెబుతోంది మద్రాసులో వుండగా వాళ్ళ జీవితం ఎంత హాయిగా వుండేదో చెబుతూ, తన వాళ్ళందరికి దూరంగా వచ్చేసి నందుకు కంటతడి పెట్టింది

మామి మాటలో తమిళం కొంతచేరి వుండటం చేత అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తూ 'వూ' కొట్టాను ఇంతలో నా దృష్టి ఒక షాపు ఎదురుగా పార్క్ చేయబడ్డ సురేంద్ర కారు మీద పడింది ఇక్కడెలా వుంది — ఇప్పుడతని కళ్ళల్లో పడాలని లేదు, మామి ప్రక్కన నడుస్తోందన్న విషయం గుర్తులేదన్నట్లు గబ గబ అడుగులు వేసాను కాని నాలుగు అడుగులు కూడ వేసానో లేదో

''అక్కా !'' అన్న పిలుపు, మరో నిముషంలో శారద నన్ను సుడిగాలిలా చుట్టేముట్టేసింది

''శారదా !'' అన్నాను ఆశ్చర్యం, ఆనందం నన్ను మూగదాన్ని చేసాయి

''అబ్బ! ఒక నిముషం నేను షాపులో నుంచి రావటం ఆలస్యం అయితే వెళ్ళే పోయేదానివి ఎంత లక్కీ !''

''సురేంద్ర కారులో వచ్చావా !'' అన్నాను

''ఔను ఇప్పుడు అతను నా భర్త''

నమ్మలేనట్లు చూసాను దాని వంక ''ఎలా జరిగింది నువ్వు ఇష్టపడే చేసుకున్నావా !''

''హాయిగా ఇష్టపడే చేసుకున్నాను అతనిలో నాకేం లోపాలు కనిపించలేదు ,

''మరి అతనికి''

''అదే ఆశ్చర్యం అక్కా ! నాన్నగారు పెళ్ళి ఆగిపోయినందుకు చాలా బెంగపడ్డారు అందులో అందరికి ఇన్విటేషన్స్ కూడ ఇచ్చాక ఇలా జరిగిందే

# దాంపత్య సంగీతం

అని ఆ సమయంలో సురేంద్ర వచ్చి నాన్నగారిని ఓదార్చాడు

'ఇలాంటిదేదో జరుగుతుందని నాకు ముందే తెలుసు స్వాతికేమాత్రం నామీద ఇంట్రస్ట్ లేదు మీరు ఆమె మనసు గ్రహించలేదేమో! మీకే అభ్యంతరం లేకపోతే శారదను నేను పెళ్ళి చేసుకుంటాను' అంటూ అర్థించాడు దానికి నాన్నగారు చాలా పొంగి పోయారు నేనేం నిరాకరించలేదు పెళ్ళి జరిగి పోయింది'' అంది శారద పక పక నవ్వేస్తూ

''నిన్ను ఇలా చూడటం చాలా ఆశ్చర్యంగా వుందే ! ''

''నాకూడాను అరకులోయ చూడాలని నేను అతనితో అన్నాను, ఆ వంకతో నిన్ను చూడచ్చని రెండు రోజుల నుంచి షాపింగ్ పేరు చెప్పి వీధులన్ని గాలించాను ఎంతనిరాశ పడ్డానో నిన్ను చూడకుండా వెళ్ళిపోతానేమో నని ''

''సురేంద్ర రాలేదా నీతో ! '' అన్నాను చుట్టు అతని కోసం చూస్తు

''అతని ఫ్రెండ్ ఎవరో మీటవ్వాలి అంటూ వెళ్ళారు ఈ రాత్రికే వెళ్ళిపోతున్నాం హైద్రాబాద్ ! ''

కొంచెం దూరంలో మామి నా కోసం వెయిట్ చేస్తూ వుండటం గమనించి ఆమెను పిలిచి శారదకు పరిచయం చేసాను

''ఇంటికోసారి రావా ! '' అన్నాను

''తప్పకుండాను పద''

దారి పొడుగున శారద ఏవేవో కబుర్లు చెబుతునే వుంది నా మనస్సులో నాన్నగారి గురించి తెలుసు కోవాలన్న కాంక్ష పెరుగుతోంది ''నాన్నగారు ఎలావున్నారే ! '' అన్నాను చివరికి నేనే వుండబట్టలేక

''ఇప్పుడు బాగానే రికవర్ అయ్యారులే ! నువ్వు వెళ్ళిపోయిన కొత్తల్లో నాన్నగారిని పలకరించాలంటేనే భయం వేసేది ''

''పోన్లే నా మూలంగా కలిగిన గాయం, నీ మూలంగా నయం అయింది ''

''నీకు మాత్రం అంత పంతం ఎందుకే ! నాన్నగారికి ఉత్తరాలు వ్రాస్తుండమ్మగా ! '' అంది శారద

''నేనా ఏ మొహం పెట్టుకొని వ్రాయను! ఆయన మనసును అంత బాధించి వచ్చాక ఒక వేళ వ్రాసినా ఆయన సమాధానం ఇస్తారా ! '' అన్నాను

ఈ లోగా కారు ఇంటి ముందు ఆగటంతో మా సంభాషణ ఆగిపోయింది శారదను చూస్తూనే కుమార్ నాలాగానే ఆశ్చర్య పోయాడు

కుమార్ మా కోసం చేసిన ఉప్మా ముగ్గురికి ప్లేట్లలో సర్దేసి మా కందించాడు

''ఆ రోజు తుఫాన్‌లా వచ్చి మాయమైన ఆ మరదలు పిల్లేనా ! '' అంటూ కుమార్ శారదని పలకరించాడు

''మంచి పేరేపెట్టారు ఆ రోజు మీ పరిచయ భాగ్యం కలగలేదు అందుకని ఇంత శ్రమపడి ఇంత దూరం వచ్చాను'' అంది శారద తడుముకోకుండా

శారద వున్న గంటసేపు ఇల్లు చాలా సందడిగా వుంది కుమార్‌లాగా శారద కూడా నిముషం కూడా రెస్ట్ తీసుకోకుండా మాట్లాడే పిల్ల 'అక్కా ఇల్లు కొంచెం పెద్దది తీసుకోండి లొకాలిటి బాగుంది కాని ఇల్లు మరీ చిన్నదైంది ' అంటు అసంతృప్తి వెలుబరిచింది

'బావ చాలాయాక్టివ్ నీ కింత బాగా సెలెక్షన్ వచ్చని నేను అనుకోలేదు' అంటూ కుమార్‌ని చాలా మెచ్చుకొంది

'నాన్నగారికి నీ మీద కోపం చాలా వరకు పోయిందిలే ఒకసారి మీరిద్దరు వస్తే నిజంగా ఆయన సంతోషిస్తారు ' అంటూ సలహాలిచ్చింది

శారద వెళ్ళిపోతుంటే ఒక్కసారి చాలా బెంగ పడ్డాను ఆత్మీయులు దూర మౌతుంటే కలిగే బాధ భరించరానిదని అన్పించింది

## 8

ఆ రోజు నేను పనిచేస్తున్న వార్డులో ఒక 'బర్నకేస్' అడ్మిట్ అయింది పాతికేళ్ళుంటాయేమొ ఆమెకు భర్త పెట్టె బాధలు భరించలేక కిరోసిన్ పోసుకొని నిప్పు అంటించుకొంది ఎయిటీ పర్సెంట్ బర్న్స్ కాబట్టి బతుకుతుందన్న ఆశలేదు ట్రీట్ మెంట్ స్టార్ట్ చేసిన కాసేపటికే ఆఖరి శ్వాస






తీసింది ఆమె కోసం భర్త కాని, ఆమె వాళ్ళు కాని ఎవ్వరు రానే లేదు పెళ్ళి అయ్యాక భర్త సరి అయిన వాడు కాకపోతే భార్య ఎంత అనాథో మొదటి సారి తెలిసింది

మనసులో రామ్మూర్తి భార్య శారద మెదిలింది "ఆమె కూడా ఏదో ఒకరోజు ఇలాటి పనిచేసినా ఆశ్చర్యపడక్కర్లేదు " అన్పించింది

ఇంటికొచ్చినా మనసు చికాగ్గా వుంది కుమార్ పేషంట్స్‌ని చూస్తున్నాడు నేను స్నానం చేసి మెల్లగా వంట ఎలాగో అయిందనిపించాను కాస్సేపు డాబా మీద తిరిగి వద్దామని పెరటి వైపు వున్న మెట్ల మీద నుంచి పైకి వెళ్ళాను సహజంగా ఎప్పుడు మేము డాబాని వాడుకోము అందుకని దుమ్ముతోను, రాలిన ఆకులతోను మెట్లన్ని చాలా చికాగ్గా వున్నాయి డాబా మీద మొదటి పాదం పెడుతునే వులిక్కి పడ్డాను సందేహం లేదు రెండు మానవాకారాలు

అతని ఒడిలో ఆమె, ఆమె చేతులు రెండు అతని మెడ చుట్టు పెనవేసి ఏదో అంటోంది బాహ్య ప్రపంచాన్ని గమనించే స్థితిలో లేరు వాళ్ళు ఆమె మా ఆవరణలోనే వున్న ప్లీడరుగారి అమ్మాయి రాణి అని గుర్తించటానికి ఆట్టేసేపు పట్టలేదు గబుక్కున వెనక్కు తిరిగి వచ్చేసాను

కుమార్ వచ్చేవరకు ఆపని ఈపని చేస్తూ గడిపాను

ఆ రోజు కుమార్ రోజు కంటే ఒక అరగంట ఆలస్యంగా లోపలికి వచ్చాడు

"అబ్బ, వెళ్ళారా అంతా ఈ రోజు చాలా బోరుగా ఫీలయ్యాను మెడిసిన్ సైడ్‌కి ఎందు కొచ్చానా అనిపిస్తోంది కుమార్ !" అన్నాను మధ్యాన్నం బర్న్స్ కేస్ గుర్తువచ్చి

"సారీ స్వాతి ! ఏ మాత్రం కంపనీ ఇవ్వలేక పోతున్నందుకు నాకు చాలా బెంగగానే వుంది కొన్నాళ్ళు ఓపిక పట్టు ఓ నర్సింగ్ హోమ్ అంటూ ఏర్పడ్డాక అంతా టైమింగ్స్ ప్రకారమే జరుగు తాయి" అంటూ కుమార్ డ్రస్ చేసుకోటానికి వెళ్ళిపోయాడు

కుమార్ మరోలా అర్థం చేసుకున్నందుకు నవ్వుకున్నాను భోజనం చేస్తున్నప్పుడు మధ్యాన్నం కేస్ గురించి చెప్పాను "అందుకే అమ్మాయిగారి మనసు దెబ్బతింది నిన్ను చూస్తుంటే మా క్లాస్ మేట్ మీనాక్షి గుర్తు వస్తోంది వార్డులో ఎవరైనా పేషెంట్స్ చనిపోతే, బంధువులతో సమంగా తను ఏడ్చేది మేమంతా బాగా ఏడిపించేవాళ్ళం, "మీకీ ప్రొఫెషన్ సూట్ కాదు" అంటూ అలాగే వుంది నిన్ను చూస్తుంటే మనం శవాలు కోయాల్సి వచ్చి నప్పుడు అవి మానవ కళేబరాలు అన్న ఫీలింగ్ కంటే అవొక స్పెసిమన్స్ అన్న దృష్టితోనే చూస్తాం అలాగే పేషెంట్‌ని స్టడీ చేస్తున్నప్పుడు, ఒక ప్రాబ్లమ్ సాల్వ్ చేస్తున్నట్లు చూడాలి అంతే అయితే సాల్వ్ కాకుండా పోయే ప్రాబ్లమ్స్ కొన్ని వుంటాయి అంతే, టేకిట్ ఈజీ !

మాటల మధ్యలో డాబా మీద చూసిన దృశ్యాన్ని గురించి చెప్పాను

"పాపం, డిస్టర్బ్ చేసావా !"

"ఛ నాకేం అవసరం? అయినా వాళ్ళు చేస్తున్నది తప్పనిపించింది,

"మరి మనమాటో!"

"కావచ్చు మనం మరీ చిన్న పిల్లలం కాము బాధ్యతలు తెలిసిన వాళ్ళం ఏది తప్పో, ఏది ఒప్పో తెలియని వయసు వాళ్ళది రాణి బి ఎ చదువు తోందని మామి చెప్పింది నిజం చెప్పండి ఆ వయసులో జీవితపు విలువలు గాని, ప్రేమ గాని అర్ధమయ్యే వయసా! నాలుగు సినిమాలు, పది నవలలు చదివి నేర్చుకున్న విజ్ఞానం తప్ప రేపు ఒక వేళ ఆమె తప్పటడుగు వేస్తే, దిద్దుకొనే అవకాశం సమాజం ఆమెకిస్తుందా ఆమె భవిష్యత్తు ఏం కావాలి"

"భేష్ ఏమో అనుకున్నాను మా స్వాతి క్కాడ బోలెడు విషయాలు తెలుస్తున్నాయి గుడ్ ఇంతకీ ఆ అమ్మాయిని పిలిచి ఆ ఎడ్వైజ్ ఇచ్చి చూడు ఏ మంటుందో!"

"పరిచయంలేని వాళ్ళకు పోయి ఉచిత సలహా లిచ్చి నా విలువను నేను పోగొట్టుకోలేను వూరికే మీతో అన్నాను అయినా ఆ అమ్మాయికి నేను అనుకున్నట్లు అలాంటి గతి పట్టకపోవచ్చు"

ఇంతలో వీధి తలుపులు ఎవరో టక టక కొడుతున్న శబ్దం విని కుమార్ చేయి కడుక్కొని తలుపులు తీయటానికి వెళ్ళాడు

"స్వాతి! నేను అర్జంటుగా ఒక పేషెంట్‌ని చూడాలి వీలైనంత త్వరగా వచ్చేస్తాను" అంటు హడావిడిగా పేంట్, షర్ట్ వేసుకొని అతని మెడికల్ చస్ట్ తీసుకొని వెళ్ళటానికి సిద్ధపడ్డాడు

"ఇంత రాత్రివేళ!" అన్నాను

"తప్పదు అవతల పేషెంట్ పాపం సీరియస్‌గా వున్నాడట పోనీ నువ్వు వస్తావా!"

"ఉహూ నాకిప్పుడు ఓపికలేదు"

"సరే తలుపేసుకో!" అంటూ అతను హడావిడిగా వచ్చిన వ్యక్తితో ఆటోలో వెళ్ళి పోయాడు

తలుపేసి ఒక్కసారి నీరసంగా కూర్చుండి పోయాను నాకీమధ్య ఒక విషయం అనుమానంగా పీడిస్తోంది అది ఏదని నిర్ధారణగా తేలే వరకు కుమార్‌కి చెప్పటం అనవసరం అనిపించింది

## దాంపత్య సంగీతం

ఒక వేళ అదే నిజమైతే నా పొరపాటేనేమో! ఇంత త్వరగానా ఉహూ వద్దు వద్దు.

* * *

ఆ రోజు ఆరేసిన బట్టలు మడతపెడుతున్నాను! వైజాగ్‌లో అన్నిటికి ఎలా కొరతో పనిమనిషిక్కూడ అలాంటి కొరతే వుంది దానికితోడు మా ఆవరణలో ఎవరికి పనిమనిషి లేకపోవటం వలన, మాకు కూడా పనిమనిషి చాలారోజులకి గాని దొరకలేదు ఇదైనా ఒకటి రెండు పనులు బలవంతంగా చేసి పోవటం తప్పించి అన్ని పనులు ఓపిగ్గా చేసి పెట్టదు కుమార్, నేను ఇద్దరం సమంగా పనులు చేసు కొనటంతో ఆ కష్టం మాకు తెలియలేదు

"ఏమ్మా! ఈరోజు హాస్పెటల్‌కి వెళ్ళలేదా!" అంటు మొదటి భాగంలో అద్దెకుండే బామ్మగారు వచ్చి పలకరించటంతో ఉలిక్కిపడి

"లేదండి మధ్యాన్నం లీవ్ పెట్టివచ్చాను తలనొప్పిగా వుంటే"

"అయ్యో మరీ ఈ పనులన్నీ చేస్తున్నావేం వెళ్ళి పడుకోకపోయావా మీ ఆయన వున్నాడుగా అదృష్టవంతురాలివి అన్ని పనులు ఆడదాని కంటే ఎక్కువగా చేసి పెట్టే భర్త దొరికాడు మీది మేన రికమా అహఁ వూరికే అనుమానం వచ్చి, మీ ఆయన్ని 'మవ్వు నువ్వు' అనటం విన్నాలే అందుకని అడుగుతున్నాను"

"లేదండి మాకేం బంధుత్వం లేదు స్నేహం తప్పించి"

"ఓహో ప్రేమ పెళ్ళి అన్నమాట. బాగుంది అందుకేనా అమ్మా, నాన్న ఎప్పుడు వచ్చినట్లు లేదు"

బామ్మగారి తెలివితేటలు అమోఘం అను కున్నాను

"నాకు అమ్మలేదండి నాన్నగారు పెద్ద ఆయన, రాలేరు ఈమధ్యే మా చెల్లెలు వచ్చి వెళ్ళింది" మా స్వవిషయాలు చెప్పటం ఇష్టం లేక, అన్నాను

"అసలు విషయం మర్చిపోయాను ఓ చిన్న గిన్నెడు కాఫిపొడి వుంటే అప్పు ఇస్తావు మళ్ళీ మా అబ్బాయి తేగానే ఇచ్చేస్తాను" అంటూ ముంత బయట పెట్టింది బామ్మగారు

బామ్మగారి లౌక్యానికి ఆశ్చర్యపడుతు ఆమె అడిగింది ఇచ్చి పంపేసాను

ఇలాటి వ్యక్తులు చాలా ప్రమాదకరమైన వాళ్ళు అన్పించింది ఎందుకో!

కుమార్ దీక్షగా తన షర్ట్స్, నా కాటన్ చీరలు ఇస్త్రీ చేస్తున్నాడు

"ఒంట్లో బాగాలేదంటూ, ఎందుకలా తిరుగు తున్నావ్ హాయిగా రెస్ట్ తీసుకో కూడదు" కుమార్ నా రాకని గమనించి అన్నాడు

"బామ్మగారు కూడ అదే సలహా ఇచ్చింది"

"ఏ బామ్మగారూ"

"మెయిన్ బిల్డింగ్‌లో అద్దెకుంటున్నారు లెండి"

"ఇంతసేపు ఆవిడతో పురాణంలో పడిపోయావా!"

"మరే! పతివ్రతా ధర్మాలేవో బోధిస్తుంటే ఎంటున్నాను"

కుమార్ పకపక నవ్వి "వింటే వినుగాని ఆచరించక"

"నిజం కుమార్! నేను నిన్ను 'నువ్వు అనేయటం' పేరుపెట్టి పిలవటం, నాతో సమానంగా, సమానంగా ఏమిటిలే నా మొహం, నా కంటే ఎక్కువగా, ఇంటి పనంతా చేయటం, నువ్వు నా మీద ఏ మాత్రం అధికారం చలాయించక పోవటం ఈ చుట్టు పక్కల వాళ్ళకు చాలా ఆశ్చర్యంగా వుంది తెలుసా! వాళ్ళంతా నాకు వినిపించేలా మాట్లాడు కోవటం రెండు మూడు సార్లు విన్నాను ఈ రోజు బామ్మగారు వ్యంగంగా నా మొహానే అన్నారు"

నా మాట పూర్తి కానివ్వలేదు కుమార్ "పోన్లేద్దు కొంత మంది తత్వమే అంత, తమ కంటే అవతల వాళ్ళు ఏ మాత్రం భిన్నంగా వున్నా భరించలేరు"

"అది జెలసీ అంటావా!"

"కొంత కావచ్చు ఆడవాళ్లల్లో ఏవిధంగానూ మార్పు రాక పోవటం కూడ కొంత అలా అనుకోవ టానికి దారితీయవచ్చు కేవలం బామ్మగార్లే కారు, ఈ వయసు యువతులకు కూడా మనం ఇలా వుండటం వింతగా వుంటుంది పెళ్ళికాగానే భర్తనో



300
గ్రాములు
రూ. 3·20
(స్థానిక పన్నులు అదనం)

మీకు మీరుగాగమనించండి !

# ఇతర డిటర్జెంట్ ఉతికే బిళ్ళ లకన్నా బరువు రెండు రెట్లు ఎక్కువ. ధర కేవలం కొద్ది పైసలు ఎక్కువ!

# టోటల్

## నీలి డిటర్జెంట్ ఉతికే బార్




## మొదటి "నిజమైన" డిటర్జెంట్ బార్!

టోటల్ - ఉతికే బార్ రీతిలో ఉన్నది.
మరియు అధికమైన శుభ్రపరిచే నీలి
డిటర్జెంట్ శక్తి ఉన్నది.
మరి ఇంకేమి? పొదుపుగ
ఉతికేందుకుగాను ఇది ఐదు చేతికనువైన
భాగాలు కలిగివుంది.

## కేవలం కొద్దిపైసల హెచ్చుకే రెండు రెట్లు బరువు!

ఒక నిర్దిష్టమయిన డిటర్జెంట్ కేక్ 125 గ్రాముల బరువు
కలదానికి మీరు ఎంత ఖర్చు పెడుతున్నారు?
250 గ్రాముల "టోటల్" ధర కేవలం రూ. 2.67.
(300 గ్రాములకి రూ. 3.20). అదీను మామూలు డిటర్జెంట్ కేక్‌లకన్న
రెండు రెట్లు బరువు ఎక్కువ. కేవలం కొద్ది పైసల హెచ్చుకే!

ఉతుకుటకు
చేతికనువుగా
ఐదు భాగాలు.

**ఆంధ్రప్రదేశ్, బీహార్ మరియు తమిళనాడులలో దొరుకును.**

కర్ణాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్, బెంగుళూరు వారి ఒక నాణ్యమయిన ఉత్పాదన.
మార్కెట్ చేయువారు : మైసూరు సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు.

MCA-TDB-51-Tel




డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### బి. ఎన్ ఆర్. — నిజామాబాద్

నా వయస్సు 22 సంవత్సరములు నాకు కడుపునెప్పి వున్నది ఈ నెప్పిని నాభి జరగడం అంటారు. ఎన్ని మందులు వాడినా తగ్గలేదు ఒక నాటు వైద్యుడు చేతికి చెట్టువేరు కట్టినాడు ఆ వేరు వూడదీస్తే కడుపునెప్పి తిరిగి ప్రారంభమవుతోంది కడితే తగ్గుతోంది దీనికి మీ సలహా ఏమిటి ?

★ సైకలాజికల్‌గా వచ్చే రోగాలకి నమ్మకమే గురి అయిన వైద్యం అంటే అతిశయోక్తికాదు

కడుపునెప్పి రావటానికి గల కారణాలను తగిన పరీక్షలు చేయించుకోవటం ద్వారా తెలుసుకోవాలి ఏదైనా రోగం ఉన్నప్పుడు ఈ పరీక్షలలో తేలిపోతుంది రోగ నిర్ధారణననుసరించి, మందులు వాడటం వల్ల ఈ నెప్పి తగ్గిపోయే అవకాశం ఉంటుంది చేతికి వేరు కట్టడం వల్ల కడుపునెప్పి నయమవటం ఆర్గానిక్‌గా రోగం ఉన్నప్పుడు సాధ్యం కాదు

### ఎ. జి. ఆర్. — ఏలూరు

నాకు 23 సంవత్సరములు పెళ్ళి కాలేదు కుర్చీలో కూర్చొని టేబుల్‌మీద వ్రాస్తూ ఎక్కువసేపు కూర్చుండటంవలన కాళ్ళు వాస్తున్నాయి నిదురించే సమయంలో ఆ వాపు కనిపించదు నిద్ర నుండి లేచేటప్పుడు గూడా ఈ వాపు వుండట్లేదు

★ ఇలా వచ్చే వాపులను డిపెండెంట్ ఎడీమా అని అంటారు దీనికి రక్తనాళాల అమరిక, వాటిలోని (సిరలలోని) కవాటాల పనితనం, ఈ రక్తనాళాల మీద తగిలే వత్తిడి, హృద్రోగాలు, అనీమియా మొదలయినవి కొన్ని కారణాలవుతాయి బ్లడ్ ప్రెషర్, రక్తంలోని హిమోగ్లోబిన్ ప్రమాణం పరీక్ష చేయించుకోవలసి ఉంటుంది అనీమియా ఉన్నప్పుడు వైద్యుల సలహా ప్రకారం చికిత్స చేయించుకోవలసి ఉంటుంది ఆహారంలో ఉప్పు కొంత తగ్గించటంవల్ల కొందరికి చాలామటుకు వాపు తగ్గిపోతుంది రోగ నిర్ధారణ చేయకుండా లాసిక్స్, ఎసిడ్రెక్స్ మొదలయిన మాత్రలు వాడకూడదు

### హెచ్. ఎమ్ — బీరకుప్పం

నేను 6 సంవత్సరముల నుండి కడుపునెప్పితో బాధ పడుతున్నాను మల విసర్జనకు ముందు ఎడమవైపు ప్రారంభమై ఆ తరువాత పొత్తికడుపు అంతా నొప్పిగా వుంటుంది తొందరగా బైటకి వెళ్ళవలసి వుంటుంది ?

★ మీరు తప్పకుండా కనీసం 3 సార్లైనా (రెండు మూడురోజుల వ్యవధి కొకసారి) మల పరీక్ష చేయించుకోవలసి ఉంటుంది ఈ పరీక్షలలో అమీబాలు లేవని తేలటం జరిగితే సర్జన్ల వద్ద ప్రాక్టోస్కోపీ, సిగ్మాయిడోస్కోపీ చేయించుకోవలసి ఉంటుంది అమీబియాసిస్ ఉన్నప్పుడు అది పూర్తిగా పోయేదాకా చికిత్స చేసుకోవలసి ఉంటుంది

### జి. యస్ ఎల్. — వైజాగ్

మా పాప వయస్సు 2½ సంవత్సరములు సంవత్సరం వయస్సు నుండి ప్రైమరీ కాంప్లెక్సు వుంది అందువల్ల ఐసోకిన్ మాత్రలు 200 ఎమ్ జి చొప్పున 1½ సంవత్సరముల నుండి వాడుతున్నాము ప్రతినెల రెండురోజులు 103° జ్వరం వస్తుంది దీనికి కారణం ఏమిటి ?

★ ప్రస్తుత కాలంలో ప్రైమరీ కాంప్లెక్స్ మోతాదుకి మించి రోగులలో కనుగొనబడుతున్నదని చెప్పవలసి ఉంది ప్రైమరీ కాంప్లెక్స్ రోగం కాదనీ, మన చుట్టూ వాతావరణంలో ఉన్న టి బి క్రిములు పిల్లల శరీరంలో ప్రవేశించగానే జరిగే మార్పులే ప్రైమరీ కాంప్లెక్స్ అనబడుతుంది శరీరంలో రోగ నిరోధక శక్తులు తగ్గి ఉంటే ప్రైమరీ కాంప్లెక్స్ పెరగటం జరుగుతుంది దీనిని ప్రోగ్రెసివ్ ప్రైమరీకాంప్లెక్స్ అని అంటారు ఈ లక్షణం ఉన్నప్పుడు మాత్రమే చికిత్స చేయవలసి ఉంటుంది మాములు ప్రైమరీ కాంప్లెక్స్‌కి చికిత్స అవసరం ఉండదు ప్రోగ్రెసివ్ ప్రైమరీ కాంప్లెక్స్‌కి మామూలుగాచికిత్స చేయవలసి ఉంటుంది ఈచికిత్సా విధానం రోగిని పరీక్షచేసి నిర్ణయించవలసి ఉంటుంది జ్వరం రావటానికి వేరే కారణాలుంటాయి టాన్సిల్స్ వాయటం, బ్రాంకైటిస్ మొదలయిన రోగాలు ఉన్నాయేమో పరీక్షింపచేయండి

### బి ఎస్. కె. — పత్తికొండ

నా వయస్సు 32 సంవత్సరములు నాకు బీజము కుడివైపున గచ్చకాయ అంత 'కణితి' వున్నది దానివల్ల నాకు ఏమీ బాధ లేదు దానివల్ల ముందు ముందు ఏమైనా ప్రమాదము వున్నదా ? ఆపరేషన్ చేయించుకోవాలా ? మందులవల్లనే తగ్గుతుందా ?

★ దీనిని సెబేషియస్‌సిస్ట్ అని అంటారు మామూలుగా ఉన్నంతవరకు దీనివల్ల ప్రమాదము లేదు దీనిలో ఇన్‌ఫెక్షన్ చేరినప్పుడు బాగా నెప్పి చేయటం, జ్వరం రావటం జరుగుతుంది ముందు జాగ్రత్తగా మందులు వాడటంవల్ల ఈ కణితి పోయే అవకాశం లేదు చిన్న శస్త్రచికిత్స ద్వారా ఈ కణితిని తీసివేయవచ్చును

---

సింహాసనం మీద కూర్చోపెట్టి గౌరవించటం, తాము అన్ని విధాల భర్తల కంటే తక్కువ అనుకోవటం, వాళ్ళ అధికారానికి వీళ్ళు తలలు వాల్చటం అనాదిగా వస్తున్న ఆచారం "

"ఆగాగు అందుకు భిన్నంగా ప్రవర్తిస్తే అసలు మీ మగవాళ్ళు భరించగలరా "

"గౌరవించి పూజచేస్తామంటే ఎవరు వద్దంటారు "

"అలా మమ్మల్ని మీరే మొదటినుంచి ట్రైన్ చేశారు "

"తప్పంత మాదే నంటావ్ ! "

"చాలావరకు మేము మీతో సమానంగా చదువుతున్నా, ఉద్యోగాలు చేస్తున్నా, సంసారంలో బాధ్యతలు వహిస్తున్నా, స్త్రీని ఇంకా తక్కువగా చూడటంలో అర్థం లేదంటాను "

కుమార్ నావంక చిరునవ్వుతో చూస్తూ

## దాంపత్య సంగీతం

"ఆ విషయంలో నీతో ముమ్మాటికి నేను ఏకీభవిస్తాను నిన్ను తక్కువన్నదృష్టితో నేనేనాడైనా చూస్తే అప్పుడే నువ్వు నన్ను వ్యతిరేకించు "

"చిత్తం గుర్తుంచుకుంటాను "

"ఇంతకీ శారద విషయం ఏం చేసావ్ ! ఆ అమ్మాయి ఆరోగ్యం బాగుపడిందా !"

"ఫరవాలేదు చాలా నయం ఆమెకే అభ్యంతరం లేకపోతే, నర్స్ ట్రైనింగ్‌కి పంపాలనుకుంటున్నాను "

"అందుకు రామ్మూర్తి ఒప్పుకుంటాడా! అసలు ఆ అమ్మాయి ఎంత ఇష్టం చూపిస్తోందో అది ఆలోచించావా !"

నేను ఏం మాట్లాడలేకపోయాను ఒక నిముషం ఈమధ్య శారదలో శారీరకంగా చాలా మార్పు వచ్చింది మనిషిలో కూడ ఇదివరకులా బెరుకు, బిడియం తగ్గాయి అయితే ఆమె భర్త నీడక్కూడ భయపడుతోంది అతనినుంచి ఏదో విధంగా తెగతెంపులు చేసుకొనేందుకు సిద్ధపడ్డట్లు మాట్లాడుతోంది ఆమెలో ఆ భావమే స్థిరంగా వున్నట్లయితే, శారదని ఏదో విధంగా ఆదుకోవటానికి నేను సిద్ధమే !

"ఆమె విషయం స్పష్టంగా తెలియదు ఇంకా ! అయినా ఆమె అంతట ఆమె తన నిర్ణయం 'ఇది' అని చెప్పేవరకు నేనేం ప్రోత్సహించను తన భర్తతో ఎలాగో అడ్జస్ట్ అవటానికి ఆమె రాజీ పడితే నేనేం అనను "

"మనం ఏం చేసినా, మన్ని విమర్శించేవాళ్ళు, మెచ్చుకునేవాళ్ళు వుంటారు ఈ సంఘంలో ! అయితే ఏది త్వరపడి నిర్ణయించుకోకూడదు " కుమార్ మాటలు వింటూ శారద విషయమే చాలాసేపు ఆలోచిస్తూ వుండిపోయాను

(ఇంకా వుంది)






# సంపూర్ణ పోషకాహారంలో వుండవలసినవన్నీ కలిసివున్న రుచికరమైన పదార్థం

# సిరిలాక్®

## ఇన్‌స్టెంట్ వీట్ మిల్క్ సీరియల్

ఇవ్వగలిగినంత కాలం మీ పాపకి చనుపాలు యివ్వండి—మీరు యివ్వగలిగిన మంచి ఆహారం అదే. 4 నెలల ప్రాయం వచ్చేసరికి పాపకి ఎక్కువగా పోషక పదార్థాలు కావాలి ఘన పదార్థాలు తీసుకోడానికి పాప సిద్ధంగా వుంటుంది. సిరిలాక్ యివ్వడం వలన, పాలు యివ్వడం మానకుండా పాప ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టడం గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి

మీ పాపకి సరిఅయిన పాళ్లలో పోషక పదార్థాలు అందించడానికి సిరిలాక్‌లో గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు మరియు చక్కెర ఉన్నాయి పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు శక్తి నివ్వడానికి, మాంసకృత్తులు పెరుగుదలకి, విటమిన్లు మరియు ఖనిజాల లోపాల నుండి రక్షణ కలిగించడానికి దీనిలో ఉన్నాయి సిరిలాక్—మీ పాప బాగుగా, ఆరోగ్యంగా పెరగడానికి

దీనిని తయారు చేయడం చాలా సులభం —దీనితో ముందుగా మరగబెట్టిన గోరువెచ్చని నీరు చేర్చండి



ముందుగా మరగబెట్టిన నీటితో సెరిలాక్ చేర్చండి



బాగా కలపండి



వెంటనే యిచ్చేందుకు తయారు

**సిరిలాక్**–పాలు వుండనే వున్నాయి

SAA/FSL/C/2258 TEL

NESTLÉ

సీరియల్

# కాలం కరిగాక

వలివేటి నాగచంద్రావతి

(గత సంచిక తరువాయి)

చిదంబరంగారి కుటుంబం ఇంకా ఆయన అధికారానికి లోబడే వుంటోంది మురళి చేసిన నిర్వాకం తెలిస్తే ఆ కుటుంబం తమని వెలేస్తుందనటంలో సంశయంలేదు ఇక తమ కుమార్తె వారి ఇంటి కోడలవటం ఎలా సంభవం ?

ఇన్ని ఊహలు మెదులుతున్నా కామేశ్వరమ్మకు ఆశ వదలటంలేదు

"నేనొక మాట చెప్పనా ? మీ భయాలన్ని వెనక్కి నెట్టి ముందు ముడిపడనివ్వండి ఆ తరవాత తెలిసిపోతేమటుకు ఏం చెయ్యగలరు వాళ్ళు ? మిమ్మల్నీ నన్నూ నాలుగు అంటారు అననివ్వండి అంతేగదా — ? నాల్గు రోజులు ఓపిక పడితే వాళ్ళే సద్దుకుంటారు" అన్నది మొదటికి వస్తూ

"మళ్ళీ మొదటికి వచ్చావు" అన్నారు కేశవరావుగారు "అలా చెయ్యడం ఇంక విష పరిణామాలకి దారితీయదా — ? నిజం వెల్లడయిన్నాడు మనని ఎంత హీనంగా చూస్తారు — ? మీరు చెడింది కాకుండా మా కులమూ చెరిచారని తిట్టిపోస్తారు కూడా సరే — నువ్వన్నట్టు అది వదిలెయ్ మనతో ఆ విసురు ఆగితే ఫరవాలేదు అమ్మాయినీ నీచంగా చూస్తారు వాళ్ళు మరీ కరినాత్ములు కారనుకో — కానీ కీడెంచి మేలెంచాలి, మనమీది కోపం అమ్మాయి మీద చూపించరనేమిటి నమ్మకం ? దాన్ని రాచి రంపాన పెడుతున్నారనంటే ఓర్చగలమా మనం ? ఆ తిరస్కారం ముదిరి ఏదో సాకున పిల్లడిచేత విడాకులు ఇప్పించేసినా ఏం చెయ్యగలం ? వద్దు చేతులారా మనమే దాని భావిజీవితాన్ని కడగండ్లపాలు చేసినవాళ్ళ మవద్దు" అన్నారు తన భయాలన్నీ బయటపెడుతూ

కామేశ్వరమ్మ మనస్సు 'ఝల్లు' మన్నది 'సుఖాలలో ఓలలాడాలిసిన తన గారాబు బిడ్డ బ్రతుకులో కష్టాలు, హింసలు' ఆ వూహామాత్ర భావనకే కంపించిపోయిందామె

ప్రస్తుతం ఆవిడ ఆశల కూడలి వసంత

మానవుడి ఉనికికి మూలం స్వార్థం మనుగడకు ఊపిరి ఆశ, కోరిక ఒకదాని వెనక ఒకటి, ఒకటి తీరితే వేరొకటి, ఒక కొమ్మ విరిగితే చుట్టూరా చిగుళ్ళువేసి ఎన్నో కొమ్మలుగా విస్తరించినట్టు ఒక కోరిక విఫలమయితే నిస్పృహపడక దానిస్థానే కోటి కోరికలు ప్రోదిచేసుకొనటం మానవుడి సహజ లక్షణం

కొడుకు కలిగించిన భంగపాటు కామేశ్వరమ్మకు తీవ్రా ఘాతమే అయినా నెమ్మదిమీద కోలుకున్నది ఈసారి తన ఆశల కలలన్నిటినీ కూతురు వసంతమీద క్రోడీకరించుకుని తిరిగి ఇనుమడించిన ఉత్సాహంతో ఊహా సౌధాలు నిర్మించుకుంటోంది

ఇప్పుడు భర్త వాటిని కూడా నిర్దాక్షిణ్యంగా కూలదోసేస్తున్నాడు మొదటికే మోసం తెస్తూ కూతురి భవిష్యత్తే అంధకారమవుతుందన్న శంక వ్యక్తపరుస్తున్నాడు

కామేశ్వరమ్మ తల్లిమనసు తల్లడిల్లిపోయింది

"ఈ సంబంధం కాకపోతే ఇంకొకటనుకోండి దానికయినా పరిస్థితేమో ఇంతేకదా ? దానికా ముప్పెలాగ తప్పతుంది ? ఏం చేద్దామంటారు ?" హీనస్వరంతో అడుగుతోన్న ఆమె కంఠం వణికిపోయింది

ఆయనకా పరిష్కారమార్గం గోచరిస్తే కదా ఆమెకు చెప్పి స్వాంతన పరచటం ? నిర్లిప్తంగా కుర్చీలో వెనక్కివాలి కళ్ళు మూసుకున్నారు కేశవరావుగారు

"చూద్దాం వసంతకేమీ వయస్సు మీరలేదు కదా ! తొందరేం ఆలోచిద్దాం" అన్నారు నెమ్మదిగా

వ్యాకులం చెందిన మనసుతో బరువుగా లేచిపోయింది కామేశ్వరమ్మ

కానయితే —

భర్త వెలిబుచ్చిన అనుమానాలతో అప్పటికి మాత్రం తన అభిలాషను వాయిదా వేసుకున్నప్పటికీ కామేశ్వరమ్మ అంతరాంతరాలలో గోపీకృష్ణను అల్లుడ్ని చేసుకోవాలనే వాంఛ పూర్తిగా కొండెక్కలేదు ఏ మూలో మినుకు మినుకుమంటూనే ఉన్నది

దానికి దోహదంగా చిదంబరంగారి అర్ధాంగి పద్మావతమ్మ వసంతని, "కోడలా—కోడలా" అంటో మురిసే మురుపు కొడిగడుతున్న వత్తిని నలిపి ఎగసన తోసినట్టుగా ఆమె ఆశని ప్రజ్వలింప జేస్తుండేది

కానీ అంతలోనే "నా కోడలు వేరే కులం మనిషి అని తెలిస్తే ఈ ఉబలాటం, ఈ ముచ్చటా ఎంతసేపు నిలిచేను ?" అని తోచగానే స్వర్గద్వార మండిగాన్ని దాటబోతూండగా ఎవరో చెవ్వు మెలేసి, "నీవు ఇందుకు అర్హురాలవు కావు" అని వెనక్కి నెట్టేసినట్టుగా దిగజారిపోతుండేది

ఆమె ఆ విధంగా మల్లగుల్లాలు పడుతూ వుండగానే కాగల కార్యం గంధర్వులు తీర్చినట్టుగా వసంత పుష్పవతి అవటంతో ఆ వ్యవహారం ఒక కొలిక్కి వచ్చేసింది

దరిమం పట్టేందుకు రమ్మని పిలుస్తూంటే పద్మావతమ్మ మొహం చిన్నది చేసుకున్నది

"ఇంతేనా పిలుపు ? నా కొడుక్కి వసంతం తెస్తావనుకున్నాను" అన్నది

ఎన్నడూ గాంభీర్యం వీడని రామయ్యగారు కూడా "ఏమమ్మా మీ తాహతుకు తగమనా పిలిచి పిల్లణ్ణి ఇస్తామంటే తెగ బెట్టుపోతున్నావు ?" అని నిష్ఠూరమేశారు

కామేశ్వరమ్మ మాట్లాడలేదు

ఆ సాయంత్రం చిదంబరంగారు పేరంటానికి కావలిసిన సామానంతా పట్టించుకు వచ్చారు

"నాకు మొహమాటాలు ముసుగులో గుద్దులాటలూ తెలీవు వసంతని మా కోడలనుకుంటున్నాం మీ అభ్యంతరమేమిటో కారణం చెప్పండి" అన్నారు తెచ్చిపెట్టుకున్న తీక్షణతతో

ఏమని చెప్పడం ? ఒప్పుకోవటమా — మానటమా ? తిరస్కరించడానికి కారణమేమని చెప్పటం ? ఉన్నసంగతి చెబితే బాంధవ్యం మాట అటుంచి ఇప్పటి వరకూ ఉన్న స్నేహితం గూడా గంగలో కలిసిపోతుంది. అంతేకాక ఇంతదాకా గుప్పిట మూసిన



**జరిగిన కథ—15 :** వయసు తాకిడికి తట్టుకోలేక నర్స్‌గా పనిచేస్తున్న సోఫియాతో కోర్కెలు తీర్చుకుందామనే దురుద్దేశంతో సొత్తు పెట్టుకొంటాడు డా మురళి సోఫియా మరో ఉద్దేశ్యంతో అతనికి తన సర్వస్వాన్ని అర్పించడమే కాకుండా ప్రచారం కూడా చేస్తుంది సోఫియాని వదిలించుకొనే వీలులేక అమ్మ దగ్గరకు పారిపోతున్న మురళిని అడ్డుకొని జరుగవలసిన తతంగమంతా జరిపిస్తాడు థామస్ ఇక చేసేదిలేక ఓ మారుమూల ప్రాంతానికి బదిలీ చేయించు కొంటాడు మురళి విషయాలన్నీ కేశవరావ్‌గారి ద్వారా విన్న కామేశ్వరమ్మ లోలోపలే మధన పడుతుంది మురళి చెల్లెలు వసంతలక్ష్మి పెళ్లి ఏర్పాట్లు జరుగుతుంటాయి సుబ్బాయమ్మ మురళి వ్యవహారాన్ని కూపీ లాగటానికి ప్రయత్నిస్తుంటుంది మామూలుగా జరిగినదానికి కొంత కల్పితం చేసి చెప్పి ఆమెను తాత్కాలికంగా శాంతపరుస్తుంది కామేశ్వరమ్మ మురళిపై వున్న కేసును పోగొట్టుకోవడాన్కి కొంత డబ్బు ఇచ్చి, మిగతాది యం. ఓ చేస్తానని చెప్పివస్తాడు కేశవరావ్ ఎంత డబ్బు ఖర్చుపెట్టినా మురళి ఉద్యోగం పోతుంది ఆ తరువాత అతను మరో గ్రామంలో స్వతంగా ప్రాక్టీసు పెడతాడు కేశవరావ్, చిదంబరం ఇద్దరూ కలిసి 'ప్లాస్టిక్ అండ్ కేన్' ఫ్యాక్టరీ పెట్టి బాగా అభివృద్ధి చేస్తారు చిదంబరంగారి అబ్బాయి గోపీకృష్ణకి తమ అమ్మాయి వసంతని ఇచ్చి పెళ్లి చేయాలన్న ఆశ కామేశ్వరమ్మ పడగా కేశవరావ్ తమలో వున్న మచ్చను గుర్తుచేస్తాడు. అదీగాక చిదంబరం తండ్రి పరమ చాదస్తుడు



వూరంత వుంటుందిగానీ ఏం లాభం? ఆధునిక సౌకర్యం ఒక్కటి పడదు రామయ్యగారికి

ఒక్క గదికీ ఎటాచ్‌డ్‌లేదు "టెంకాయ పాలలాంటి జల మళ్లీ పంపెందుకు?" అని కుళాయి పెట్టించలేదు పోనీ బావికి మోటరయినా వేయించరా అంటే అదీలేదు ఇంటి వాడిక నీళ్లన్నీ గిలకమీద చేదుకోవాల్సిందే

అవయినా పనిమనిషి చేరబోయటానికి వీల్లేదు పనిమనిషి ముట్టిన నీళ్ల రామయ్యగారుగానీ, ఆయన భార్యగానీ స్నానమయినా చేయరు ముసలమ్మగారికి తగని ఛాదస్తం అవి తొక్కినట్టున్నాను, ఇవి తాకినట్టున్నాను అంటో రోజుకి పద్నాలుగు తడవలు నెత్తిన నీళ్ల దిమ్మరించుకుంటుంది కడిగినవే కడిగీ, తొలిచినవే తోలిచీ బిందెలు కొద్దీ నీళ్ల పారబోసేస్తుంటుంది ఇదేమనటానికిలేదు వీరి కంటూనూ, మడివంటకంటూనూ మూడువంతుల నీళ్ల ఇంట్లో ఎదిగిన ఆడపిల్లలో, పద్మావతమ్మో మోయవలిసిందే

పద్మావతమ్మ చాలా ఓపికమంతురాలు ఆవిడ కాబట్టే ఆ ఇంట్లో నెగ్గుకువచ్చిందనాలి కలవారింటి కోడలన్న పేరేగానీ ఆ సిరీ — సంపదా ఆమెకు సుఖ శాంతుల నివ్వలేదు

వయస్సు ముదిరి ఇప్పుడు కాస్త ప్రతాపం తగ్గుమొహం పట్టింది కానీ అత్తగారు త్రివేణమ్మ కోడిగుడ్డుకి ఈకలెన్నే మనిషి కదిలితే తప్పు మెదిలితే తప్పు తను కూర్చుని నౌకరుకు చెప్పినట్టు పనులు పురమాయించి చాకిరీ అంతా చేయించేది చేసిన ప్రతిపనికీ వంక పెట్టేది సాధించేది సతాయించేది

ఇక మావగారు కోడలు తనకంటపడటమే అవినయలక్షణమని రంకెలు వేసేవాడు

నలుగురు ఆడబడుచులు తన వయసుకు ఇద్దరటు ఇద్దరిటుగా వుండేవారు వారయినా ఆమె ఎడల స్నేహం నెరపేవారు కాదు తమ వించామెను కేటాయింపుగానే చూసేవారు

'చితికిన తమ కుటుంబం అష్టకష్టాలంటారే — అలాంటి కష్టాలన్నీ పడిపడి ఇప్పటికి ఈ సంపత్తునందుకున్నది ఆ ఆధిక్యత తమకు మాత్రమే దక్కాలిగానీ తగుదునమ్మా అని

# కాలం కరిచాక

ఇప్పుడొచ్చిన పరాయింటి పిల్లకి అయాచితంగా ఎందుకు పంచి యివ్వాలి?' అన్నట్టుండేది అత్తా ఆడబడుచుల వైఖరి

అధికారికం, ఆజ్ఞాపనం తప్ప ఆప్యాయత పొంది ఎరుగదు వారినించి పద్మావతమ్మ ఎవరితో చెప్పుకుంటుంది? భర్త వున్నాడు, ఉత్సవ విగ్రహం వంటివాడు ఆయనతో చెప్పుకున్నా ఆ గోడతో చెప్పుకున్నా ఒకటే

పుట్టిల్లు లేకపోలేదు చెప్పి వారినికూడా విచారంలో ముంచటం తప్ప వారు మాత్రం ఏం చెయ్యగలరు? ఈ దిక్కుమాలిన దేశంలో ఆడదానికి భర్త ఇల్లు వినా దిక్కులేదు కదా!

అంతా ఓర్పుతో సహించింది సర్దుకుపోయింది ఎవ్వరేమననీ తన్ని కానట్టు తప్పుకుపోయింది

కాలక్రమాన పిల్లలు పుట్టుకువచ్చారు బ్రతుకులో సారం కనిపించసాగింది పద్మావతమ్మకు వారి నవ్వులతోపాటు ఆమె చీకటి జీవితంలో వెలుగులు చొచ్చుకువచ్చాయి

ఆడబిడ్డలు ఒక్కరొక్కరికీ పెళ్లిళ్లయి అత్తవారిళ్లకు వెళ్లిపోయారు ఆవారా గూటింపుల్లో మినహాయింపు వచ్చింది

'సఖ్యం సాప్తపదీనాం—' అన్నారు అటువంటిది ఏడడుగులు కాదు — ఏడు రెళ్ల పద్నాలుగు సంవత్సరాలు కలిసి బ్రతికిన సన్నిహితత్వం అత్తమామల తత్వంలో అనుబంధానికీ, ఆదరణకీ చోటు చేసింది

అలాగని నెత్తిమీద పెట్టుకోడం మొదలు పెట్టారని కాదు పరాయిగా చూస్తూ పరీక్ష పెట్టడం వేరు — అయినవాళ్లగా ఆరడిపెట్టడం వేరు కద!

'ఫరవాలేదు ఒడిదుడుకులు సద్దుకున్నయ్ ఒక మనిషిగా ఇంట్లో స్థానం సంపాయించుకున్నాను' అని పడిన బాధలు మరుపునబడి కాస్త ప్రశాంతిని అనుభవించేటంతలో ఆ ఆనందం కడంటా దక్కనీకుండా పిల్లలతో గడబిడలు ప్రారంభం

అత్తమామలకి మనుమలంటే వాత్సల్యముంది కానీ అది వారి పెద్దరికపు అహంకారానికి ఆటంకం కాలేదు మంచి శిక్షణ పేరుతో ఏమాత్రం స్వాతంత్ర్యానికీ ఆస్కారం లేకుండా మగపిల్లల క్రాపింగుల మొదలుకొని, ఆడపిల్లల జాకెట్టు చేతుల వరకూ అన్నిట్లోనూ వేలు పెట్టడమే అన్నిటికీ నిర్బంధ పెట్టడమే

పిల్లలది చైతన్యం పొంగివస్తున్న ప్రాయం ఇంకా పరాధీనతా భావం జీర్ణం కాకపోవటంచేత ఓ పట్టాన లొంగక కోరింది తీర్చుకునే హక్కు కోసం పెనుగులాడేవారు దానితో సుర్షణల మొదలు అయ్యేవి

పద్మావతమ్మ అత్తమామలతో ఇంతవరకూ నెగ్గింది అంటే వారిని ఎదిరించి, గెలిచికాదు వారి అభిప్రాయాలకు లోబడే, అవి తూచా తప్పకుండా పాటించి మాత్రమే

ఆమె వారికి దాసోహం అన్నది వారి అహానికి జో హుకుం అన్నది ఆ ఇంట్లో ప్రతివారి అడుగులకీ మడుగులొత్తింది అభిమానాన్నీ వ్యక్తిత్వాన్నీ చంపేసుకు బ్రతికింది మానసిక బానిసత్వమే చేసింది

కానీ పిల్లలు తల్లిలాగ ఏమిచెప్పినా డూడూ బసవన్నలుకారు వాళ్ళకి స్వంత అభిప్రాయాలున్నాయి, ఇష్టాలున్నాయి కోరికలున్నాయి వాటిని కాదంటే ఎదిరించే ధైర్యమూ, సాహసమూ వున్నాయి

వాళ్ళు తరచూ దేనికో దానికి పంతంపట్టి కూచునే వాళ్ళు ఆ తప్పు పద్మావతమ్మదయ్యేది

పిల్లల్ని కనడం వరకూ తనవంతు, అజమాయిషి అంతా వారివంతూ అయినా సమయమొచ్చేసరికి 'నీ పెంపకమిలా ఏడిసింది' అని ఆవిణ్ణే దుయ్యబట్టేవాళ్ల 'వాళ్లకి నువ్వే నేరిపిపెడుతున్నావ'నేవాళ్ల 'నీ అలుసుచూసుకునే వాళ్లింత పేట్రేగి పోతున్నార'నేవాళ్ల

ఈ అన్యాయారోపణకు బిత్తరపోయి, ప్రాణం ఒప్పకపోయినా తన నిర్దోష నిరూపణకై పిల్లల్ని కొట్టేది, తిట్టేది అఖరుకు కొట్టినా తన కాళ్లకే చుట్టుకుని వాళ్లేడుస్తుంటే ఒకరి దయ కోసం వాళ్లనంత హింసపెడుతున్న తననిర్దాక్షిణ్యానికి తానూ కన్నీళ్ల పెట్టుకునేది పద్మావతమ్మ






# ఆమె కథ!..కాదు..కళ్ళ కాదు కాదు..ఆ కళ్ళ కథ

చాలాకాలమయింది కథ రాసి అందులోనూ, సెక్సు కథరాసి దాదాపు రెండున్నర దశాబ్దాల పైచిలుకే అయి ఉంటుంది ఆ రోజుల్లో చలంగారూ, చౌడేశ్వరీ దేవీ, ధనికొండ, నేనూ ఈ రకం కథలు ముమ్మరంగా రాస్తూ ఉండేవాళ్ళం అంతకు ముందు చలంగారూ — ఆయనతోబాటుగా కొంత వరకూ కుటుంబరావుగారూ — ఈ కోవకు చెందిన కథలు రాశారు ఆ దరిమిలా, కుటుంబరావుగారు, ఆ దోవలోంచి పక్కదోవకు వెళ్ళిపోయారు తరువాత మేమంతా ఈ దోవలోకొచ్చాం

ఈ గొడవంతా మీ ముందు వెళ్లబోసుకుంటానికి కారణముంది సుమారుగా పాతికేళ్ల తరవాత మళ్ళీ సెక్సు కథరాయాలని నాకెందు కనిపించింది? ఇప్పటికీ మార్కెట్‌లో దానికెక్కువ గిరాకీ ఉండడమా? లేకపోతే— నాకు నేనే విధించుకున్న పరీక్షా?

సాధారణంగా సెక్సు కథల్లో, అబ్బాయిముఖ్యం కాదు, అమ్మాయే ముఖ్యం ఆ అమ్మాయి అందంగా ఉండాలి ఆ అందాన్ని — తనివిదీరా వర్ణించాలి మన పూర్వకవులు, ప్రబంధాల్లోనూ, కావ్యాల్లోనూ, కథానాయికను వర్ణిస్తారే — నఖశిఖ పర్యంతం — అల్లాగా వర్ణించాలి పద్యాల్లోచేసిన వర్ణన కొందరికే అర్థమయ్యా, మరికొందరికి పూర్తిగా అర్థంగాకా— పద్యం నడకమీదా, లయమీదా, తూగుమీదా, ఆధారపడి గునుకు పరుగుతో సాగిపోతుంది మన మహాకవులందరూ, ఆ పనే చేశారు ఏ కథానాయిక, అంగాంగ వర్ణననూ, విడిచి పుచ్చలేదు కావ్యలక్షణం, కావ్య ప్రయోజనం, కావ్యాత్మ, కవిత్వతత్వ వివేచనం, అభిధ, వ్యంజనం, అభివ్యక్తీకరణం—ఈ సరంజామానంతా కట్టగట్టి కాలవలో పారేసినా ఫర్వాలేదు కావలసింది కథానాయిక వర్ణన — అందులోనూ, సర్వాంగ వర్ణన — అందులోనూ, చదివేవాడి మనస్సులో దీన్నిహ వదిలేద్దాం!

వచనంలో అలా చేయడానిక్కాదు ఏపాటి అక్షరజ్ఞానమున్నవారికయినా, ఛటుక్కున తెలిసిపోవాలి వారికి తెలీని భావాన్ని చెప్పకూడదు అథవా చెప్పదలచుకొంటే వారికి తెలిసిన భాషలోనే చెప్పాలి చదివేవారు చదువుతూనే కిర్రెక్కిపోవాలి మతి పోగొట్టుకోవాలి ఆ తరహా సాహిత్యం కోసం జనం ఆవురావురుమనాలి అనేట్టుగా రాయాలి అలా రాస్తేతప్ప పత్రికలు వేసుకోవు అలాంటివి వేస్తేతప్ప జనం కొనరు అందుకని—కథానాయికను వర్ణించడం, ముఖ్యం ఆ అందమైన కథానాయికను, ఇంకో కథానాయకునితో కలిపేసి — ఆ తరవాత జరిగే రంగరంగ వైభవాలను కుతిదీరా వర్ణించడం సెక్సు కథల్లో మరీ ముఖ్యం

సాధారణంగా ఈ వర్ణన కళ్లతో ప్రారంభమవడం సాంప్రదాయం ఆ సాంప్రదాయాన్నే నేనూ పాటిస్తున్నాను అవధరించండి!

ఆమె కళ్ళు

ఆమె కళ్లల్లోకి చూశాను ఆ కళ్ళు నాకు పరిచితమైనవి ఇప్పుడిక్కడ చూస్తున్నానుగానీ, వాటిని నేను ఎక్కడెక్కడో చూశాను ఎప్పుడెప్పుడో చూశాను అప్పుడప్పుడూ, అక్కడక్కడా చూశాను ఇప్పుడు మాత్రం, ఇక్కడే చూస్తున్నాను

మీరు నన్నొక క్షణం ఆలోచించుకోనిస్తారా?



ఒక్కక్షణం చాలు ఒకేఒక్క క్షణం ఆ క్షణ కాలంలో — నా జ్ఞాపకాల మడతలన్నింటినీ విప్పేసి, ఆ అడుగు పొరల్లో, అట్టడుగు పొరల్లో అట్టట్టట్టట్టడుగు పొరల్లో దాక్కొన్న స్మృతులను, స్మృతి చిహ్నాలను వెలికి తీస్తాను ఒక్కొక్కటే మీ ముందుంచుతాను!

* * *

గిన్నె అడుగున పాలచుక్క ఆకలితో అలమటించిపోతున్న — ఓ చిన్న చీమ గోడమీదుగా, గిన్నె అంచుకు పాకి, లోపలికి తొంగి చూసింది పాలచుక్క గిన్నె అడుగున ఉన్నది, ఆకలి తనదగ్గరున్నది పాలచుక్క కోసం మెల్లిగా — చాలా మెల్లిగా—బహు మెల్లిగా ఆ చిన్నారి చీమ, కిందికి దిగుతున్నది కలవారి కుటుంబంగదా! కడగొట్టువాడికి వెండి గిన్నెతోనే పాలుపడతారు గిన్నె లోతట్టున—నున్నగా— తళతళ లాడుతూ మిలమిల లాడుతూ ఉంది — వెలుగు పడినా, జారిపోయేంత నునుపు చిన్న చీమకు ముందు కాళ్లు జారి పట్టుతప్పి నప్పుడు, భయంతో బెంబేలెత్తిన దానికళ్లు నాకు గుర్తుకొచ్చాయి

ఓ సారి, కృష్ణానదికి వరదలొచ్చాయి దరులను వొరుసుకొంటూ, తోసుకొంటూ, కోసుకొంటూ ప్రవాహం ఉరకలెత్తుతోంది ఒడ్డునున్న మొక్కామానూ, వరదనీటిలోకి తూలి, వాలిపోతున్నాయి













నేను — తరచుగా కూచునే జమ్మిచెట్టుకేసి, చూస్తున్నాను ఆ చెట్టునీడన కూచుని, నేను పిల్లనమ్మ ఆటలాడిన రోజులు, పచ్చివేరుశనగ మండల్ని, తంపటి వేసుకొన్న రోజులు, సగం అన్నం ముందుతిని మిగతా సగం దానిమాటున దాచుకొన్న రోజులు గుర్తుకొచ్చాయి అర్జునుడు దాచుకొన్న పాశుపతాస్త్రం కోసం, అనేక దఫాలు వెర్రిగా, ఆ కొమ్మల్లోకి చూడడం జ్ఞాపకం వచ్చింది ఆ చెట్టు, వరదలో కొట్టుకుపోకుండా ఉంటే బావుండుననిపించింది కానీ — వరద — నా మాట వినలేదు ఓ పెద్ద తరంగం — ఉదుటుగా వచ్చి, వొడ్డుకు తాకింది పెళ్ల — పెళ్లా నిశ్శబ్దంగా, నదిలోకి జారిపోయింది జమ్మిచెట్టుకూడా వొరిగింది అప్పుడు సన్నగా, ఆకుపచ్చ మిణుగురుల్లా ఉండే దాని ఆకుల కళ్ళన్నీ, దీనంగా,భయంగా, నా వేపు చూడడం గుర్తొచ్చింది

* * *

చిన్నబోను బోనులో మరీచిన్న — కొబ్బరి ముక్క దాని వాసన గదంతా పలచగా అలుముకొన్నది అటూ ఇటూ గెంతి, మూచూసి ముందుకు దూకి, బోను తీగెల్ని కొరికి, సాధ్యంకాదని తేలాక విసుక్కొని, అతి ప్రయత్నంమీద లోపలికిదూరి, కొబ్బరిముక్కనూ,ఆనందంగాతిని,బయటికొచ్చేందుకు దోవ తెలీక, బిక్కుబిక్కుమంటున్న చుంచెలుక కళ్లు నాకు గుర్తుకొచ్చాయి

* * *

హోటలు వెనగ్గా రెండు కుప్పతొట్లు! ఆ తొట్లనిండా ఎంగిలాకులు ఆ ఆకులకోసం తారట్లాడే ఊరకుక్క — ఆ కుక్కను తోలలేకా,ఆకుల్ని వొదులుకోలేకా, కుక్కవేపు భయంతో, కోపంతో, అసహ్యంతో, ద్వేషంతో, కసితో, ఛలఛలమండే మంటలతో నిండిన పదేళ్ల పసివాడి కళ్లు గుర్తుకొచ్చాయి

* * *

చాలా సంవత్సరాలనాటి మాట జారిపోతున్న బొందు లాగుల్ని ఎగదీసుకొంటూ, చీమిడిని ఎగ బీలుస్తూ, చప్పుడు చెయ్యకుండా, వొంగి, కూచుని — తూనీగల్ని పట్టుకొని, దాని తోకలోకి ముల్లుగుచ్చితే, ఆ బాధ భరించలేకా విదిలించుకొని పోలేకా —

## ఆమె కథ! కాదు...

గిలగిలా తన్నుకొంటున్నప్పటి తూనీగ కళ్లు గుర్తుకొచ్చాయి

* * *

ఎందుకొచ్చిందో తెలీదు ఓ చిమ్మట—గోడమీద వాలింది వాలి — ముందు కాళ్లను చాపి, ముడిచి, అలసట తీర్చుకొంటున్నది నెత్తిమీదుగా, పైకి లేచిన రెండు మీసాలను, అటూ ఇటూ తిప్పింది ఎందుకోసమో, ఎవరికోసమో, ఎదురుచూస్తున్నది ఎదురు చూస్తున్నవారు కాకుండా — వెనగ్గా నిశ్శబ్దంగా — మెల్లిగా — పాకుతూ వచ్చి—టక్కుమని, బల్లి నోట కరచుకొన్నప్పుడు — ప్రాణ భీతితో విలవిలలాడే చిమ్మట కళ్లు నాకు గుర్తుకొచ్చాయి

* * *

ఎండాకాలం కాలవలో నీరు ఇంకిపోతున్నది అక్కడక్కడా — మెరకలు బయటపడుతున్నాయి కూడా వొడ్డునానుకొని, సన్నపాయలాగా — నీరు ముందుకు పాకుతోంది కాస్త లోతు చూసుకొని, మావు దించాడు, జాలరి మావుకు దిగువగా, వొత్తుగా చిల్లకంప ఆ కంపలోంచి నీరు తప్ప గాలి తప్ప, అప్పుడప్పుడూ వెలుగు తప్ప — ఇంకేదీ వెళ్లదు నీటి జాలున వచ్చిన చేపలన్నీ, ముళ్లను మూసి, వెనక్కు మళ్లీ మావులో చేరేవి ఒకరోజు, రెండురోజులు, నాలుగురోజులు మావునిండా బిలబిల లాడుతూ చేపలు జాలరి కాలవలోకి దిగాడు భార్య వొడ్డునే గోనెసంచీ పట్టుక్కూచుంది సందిట నిండా చేపల్నిపట్టి, సంచీలో వేస్తున్నాడు జాలరి అవి గిలగిల్లాడుతూ, జారిపోతూ, పారిపోతూ ఉన్నప్పుడల్లా — పళ్ళు బిగించి-వడేసి — వాటిని సంచీలోకి తోసేస్తున్నాడతను ఆఖరికో గడగ్గాయి మిగిలింది అది చిక్కడంలేదు చిక్కినట్లే చిక్కి — ఛటుక్కున జారి నీళ్లల్లోకి తుళ్లుతోంది ఒక్కసారిగాదు—రెండుసార్లుగాదు— నాలుగైదుసార్లు అతనిక్కోపం వచ్చింది బురదంతా కెలికి కెలికి, ఆ దుదుకు పిండాన్ని పట్టుకొని, రెట్టకొద్దీ మైలు రాయికేసి విసిరాడు చేప సగందాకా చీరుకుపోయింది అయినా బలాన్నంతా కూడ దీసుకొని, ఆఖరి ప్రయత్నంగా, శరీరాన్ని కదపడానికి ప్రయత్నించి — కదపలేకపోయి నప్పటి చేపకళ్లు నాకు గుర్తుకొచ్చాయి

* * *

పనుల్లేవు ఉన్నా పిలిచేవాళ్లులేరు ఉన్నా పోటీ ఎక్కువ అడుక్కుతిన్నా పెట్టేవారు లేరు పోలిగాడికేమీ పాలుపోలా తను పెద్దవాడు గనుక — నాలుగైదు రోజులు తిండిలేకపోయినా తట్టుకొంటాడు తనను చేసుకొన్న పాపానికి పెళ్లాం కూడా పస్తులుండటానికి అలవాటు పడింది కానీ— నాలుగేళ్ల చంటి వెధవ ఉండలేకపోతున్నాడు వాడి ఏడుపు చూడలేక పోలిగాడు గింగిరాలు తిరిగిపోయాడు వలను భుజానవేసుకుని, కొండ ప్రక్కనున్న తోపులో కొచ్చాడు ఆ తోపు కంచెనిండా కుందేళ్లు! ఎలపన్ని రేలాకు చుట్టుముట్టించి — కంచెకివతలగా వచ్చి బాణాకర్రతో, కంచెమీద కొట్టడం సాగించాడు జిమ్ముమంటూ నుసి పురుగులేచింది ఖస్సుమంటూ పసిరికపాము జరజరలాడుతూ తోటలోకి పాకిపోయింది ఓ పెద్ద కుందేలు, మూడుపిల్లలూ, ఛకఛకలాడి చెవులు, అటూ ఇటూ తిప్పి, చప్పున తోపులోకి పరుగెత్తాయి తల్లికుందేలు ముందుగా-

## కార్లకు పెట్రోలియంగ్యాస్!

కార్లకు పెట్రోలు, డీసిల్‌కంటే లిక్విడ్ పెట్రోలియం గ్యాస్ మంచిదని, దీని వలన వాతావరణ కాలుష్యం అతి తక్కువగా ఏర్పడుతుందని పశ్చిమ జర్మనీలోని వాతావరణ కాలుష్య సంఘం ఆ ప్రభుత్వానికి సమర్పించిన నివేదికలో పేర్కొన్నది ఈ కార్లనుండి వెలువడే వాయువుల్లో సీసము ఉండదు కార్బన్ మోనాక్సైడ్, హైడ్రోకార్బన్లు తక్కువగా ఉంటాయి శబ్దము కూడా తక్కువే ప్రస్తుతానికి నగరాల్లో తిరిగే వాహనాలకు గ్యాస్ ఇంజన్లు అమర్చడం మంచిదని కూడా ఈ సంఘం పేర్కొన్నది వాతావరణదృష్ట్యా గ్యాస్‌ను ఇంధనంగా ఉపయోగించడం మంచిదే అయితే దీనివలన ఖర్చు ఎక్కువ అవుతుంది

పిల్లలు దాన్ని అనుసరిస్తూ — తల్లి — ఓ బారదూకి, ఆగి, ముగ్గురు పిల్లల్నీ తొందరచేసి— మరో దూకు దూకి— మరోసారి ముగ్గురు పిల్లల్నీ చూసి, ఇంకో సారి దూకి, ఈసారి ఇద్దరు పిల్లల్నేచూసి, మూడో పిల్ల వలలో చిక్కి, విలవిలా గిలగిలా తన్నుకుంటు న్నప్పుడు — అటుకేసే దిక్కుతోచక, బెంబేలు పడి పోతున్న తల్లికుందేలు కళ్ళు నాకు గుర్తొచ్చాయి

*  *  *

అందరూ వెళ్ళిపోయారు ఆరుగంటలూ వెళ్ళి పోయాయి, ఆఫీసరు వెళ్ళలేదు అతగాడు వెళ్ళిందాకా తనూ వెళ్ళలేదు తన ఉద్యోగం, అతని 'ఇష్టం' మీద ఆధారపడి ఉంది ఆ ఇష్టం తన శరీరంమీద పరుచుకొని ఉంది

ఇంతకన్నా హీనాతిహీనమైన ఉద్యోగాలకోసం తను చేసిన ప్రయత్నాలేవీ జానకి మర్చిపోలేదు అప్పుడప్పుడు ఆవిడ అనుకొనేది — తనకీపేరును, తల్లిదండ్రులు ఆలోచించే పెట్టారేమోనని! ఆ జానకి జీవితమంతా కష్టాలమయం అక్షరాలా తన జీవితమూ అంతే అయింది

తన చదువూ, తెలివితేటలూ, చురుకుతనమూ ఇవేవీ తనకింత అన్నం పెట్టలేకపోయాయి ఈ యోగ్యతలెవరికీ అవసరం లేకపోయాయి వారిక్కావలసిన 'యోగ్యత' అందం — తన వయసు — తన శరీరం మామూలు యోగ్యతలకు చెల్లుబడి లేనప్పుడు చెల్లే యోగ్యతను తను బయట పెట్టక తప్పలేదు ఈ నిర్ణయానికి రావటానికి ముందు జానకి, రోజులకు రోజులు ఆలోచించింది ఆలోచించి ఆలోచించి, ఆలోచించి అలసిపోయిందే తప్ప, మరో దోవ కనిపించలేదు

పోనీ —

తనకు పెళ్ళయినా అయి ఉంటే — ఆ బరువు బాధ్యతలేవో ఆ మొగుడనేవాడే చూసుకొనేవాడు సంచులకు సంచులు కుమ్మరించి, తనకో భర్తను కొనే తాహతు తండ్రికి లేదు ఉద్యోగం చేస్తున్న అమ్మాయికయితే — కట్నాల బెడద — అసలుండదని కాదుగానీ — ఇప్పుడున్నంత ఉండదు ఆ ఉద్యోగం కోసం వేట ప్రారంభించింది జానకి చిత్రమేమి

## అధికారం

అసమర్థుని చేతిలో
నిన్నటి పువ్వు
నేటి వాగ్దానం
రేపటి వర్షం
సమర్థుని చేతిలో
నిన్నటి వర్షం
నేటి పువ్వు
రేపటి (జీవితాని)కి హామీ

— కాశీనాథ & కాశీనాథ

టంటే — ఉద్యోగ్యమే జానకిని వేటాడ్డం ప్రారంభించింది

ఈ వేట కార్యక్రమంతో జానకి పూర్తిగా అలసిపోయింది చచ్చీచెడీ — ఈ ఉద్యోగం సంపాదించింది నెలరోజులపాటు 'తాత్కాలికం' అన్న షరతుమీద పని చేసింది ఆ నెలరోజులూ, ఈ రోజుతో పూర్తవుతాయి ఈ రోజున 'తుదినివేదిక' ప్రధాన కార్యాలయానికి వెడుతుంది భవిష్యత్తంతా, జానకి కళ్ళముందు మసక మసగ్గా మెదలింది ?

తన సుఖం — తన పెళ్ళిమీద ఆధారపడి ఉంది తన పెళ్ళి — తన ఉద్యోగంమీద ఆధారపడివుంది తన ఉద్యోగం, ఈ 'తుది నివేదిక'మీద ఆధారపడి వుంది ఆ నివేదిక, ఆఫీసరుగారి దృష్టిమీద ఆధారపడివుంది ఆ దృష్టిని తొణక్కుండా చేయడం తన అందంమీదా, వయసుమీదా ఆధారపడి ఉంది

జానక్కి చెమటలు పోశాయి చెంగుతో ముఖం తుడుచుకొంది మెడ తుడుచుకొంది అరచేతుల్లో ఊదుకొని, చెమటను ఆర్పుకొంది లోపలినించి సెగలూ, పొగలూ, ఆవిరులూ తోసుకొస్తున్నాయి

ఎంత స్థిమితంగా కూచుందామన్నా — జానకి కుదుట పడలేకపోతున్నది ఏడుగంటలూ దాటాయి ఆఫీసంతా నిశ్శబ్దం! దూరంగా పాత సీలింగ్ ఫ్యాన్ పెడుతున్న సన్నని గురక - గోడగడియారం తననే అప్పళించి చూస్తున్నట్లు జానకి గిదాటు పడింది

స్ప్రింగ్ డోర్ తెరుచుకొన్నది
మెత్తని బూట్ల చప్పుడు —
దగ్గరగా వచ్చి ఆగినట్లుగా తోచి
జానకి తలెత్తి చూసింది

ఎదురుగా ఆఫీసరు అతని చేతిలో కవరు దానిమీద హెడ్డాఫీస్ అడ్రస్ ఆ కవరులో మరో చిన్నకవరు దానిమీద 'కాన్ఫిడెన్షియల్' అన్న వాక్యం ఎర్రగా వెక్కిరిస్తో ఆ కవరులో రెండు టైపు చేసిన కాగితాలు

ఆ కాగితాలు చిన్నకవర్లోకి వెళ్ళి, ఆ చిన్న కవరు పెద్ద కవర్లోకి వెళ్ళి, ఆ పెద్ద కవరు పోస్టు డబ్బాదాకా వెళ్ళడానికి — తను ఆఫీసరుగారితో వారు రమ్మన చోటుకు వెళ్ళాలి

వెళ్ళడమా ? మానడమా ?

జానకి ఓ క్షణం ఆలోచించింది

ఆలోచించి వెళ్ళడానికే నిశ్చయించింది నిశ్చయించి సన్నగా నవ్వింది ఆ నవ్వు నిప్పుల్లోంచి వచ్చినట్లుగా ఉంది అలా చూస్తున్నప్పటి జానకి కళ్ళు నాకు గుర్తుకొచ్చాయి

*  *  *

క్షమించండి !

పసందైన ప్రణయ కథను చెబుతానని మాటిచ్చాను కథానాయికను శిఖనఖ పర్యంతం వర్ణించి, మిమ్మల్ని ఆకట్టుకొందామనుకొన్నాను అనుకొని — సాంప్రదాయానుసారంగా, నేత్ర వర్ణనతో ప్రారంభించాను అయితే ఈ ప్రారంభం మీక్కావలసినట్లుగా ప్రారంభం కాలేదు కాలేదు సరిగదా —మరో కథకు ప్రారంభమయి కూచుంది ఈసారికి నన్ను మన్నించండి !

మరోసారి మనం కలుసుకొన్నప్పుడు—అక్షరాలా— పసందైన మరో ప్రణయ కథనే మీకు చెబుతానని హామీ ఇస్తున్నాను 








ిష్టర్ మైకేల్ ఫెరేరా, వర్ల్డ్ అమెచూర్ మరియు వర్ల్డ్ ఓపెన్ బిలియర్డ్స్ ఛాంపియన్



# సినిమా



'నవోదయం'లో ముచ్చెర్ల అరుణ

## శ్రీ వాణీచంద్ర కంబైన్స్ తొలి చిత్రం

"కక్షకు సంబంధించిన ఇతివృత్తం గనుక పూర్తి ఆక్షన్ చిత్రమిది. మోహన్‌బాబు సరసన స్వప్న, గీత, కవితలు నాయికలు. డిటెక్టివ్ భయంకర్‌గా సారథి కడుపుబ్బ నవ్విస్తాడు," అన్నారు నిర్మాణ సారథి ఎస్. వి. సుబ్బరాజు. ఈయన కథ, సమర్పణలో కలిదిండి విశ్వనాధరాజు, ఆర్. వెంకట్రామరాజు నిర్మించే చిత్రంలో సుధాకర్, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, విజయలలిత ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. ఆదుర్తి నరసింహ మూర్తి, ఎస్. ఎస్. లాల్, బి. చలం, నాయని మహేశ్వరరావు, రఘురాం, ధ్రువకుమార్, కె. వెంకట్రామరాజు తెరవెనుక కృషి చేస్తున్నారు. "మొదటి షెడ్యూల్ ఆగస్ట్ 2 నుంచి 13 వరకు జరిగింది. రెండవ షెడ్యూల్ సెప్టెంబర్ 15 నుంచి నెలాఖరు వరకు జరుగుతుంది. నవంబర్‌లో విడుదల," అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే పి. చంద్రశేఖరరెడ్డి.

## పగబట్టిన బెబ్బులి

"కరాటే ఫైట్స్... ఏనుగులు, పులులు వగైరా మృగాల పోరాటాలు సంభ్రమాశ్చర్యాలను కలిగిస్తాయి," అన్నారు దేసు వెంకటసుబ్బారావు. ఈయన సమర్పించే శ్రీ విఘ్నేశ్వరా ఆర్ట్ క్రియేషన్స్ చిత్రంలో జయంతి, మంజుల, హిందీ నటులు అమ్రేష్‌పురి, శెట్టి, ఫైటర్ జస్టిన్ ప్రభృతులు పాల్గొన్నారు. మాటలు, పాటలు గోపీ రాశారు. సత్యం సంగీత దర్శకుడు. పి. ఎస్. ప్రకాష్ ఛాయ, నరసింహారావు కూర్పుతో ఎస్. వి. రాజేంద్రసింగ్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించిన ఈ చిత్రానికి ఎస్. వి. సుబ్బారావు, కె. రామకోటయ్య నిర్మాతలు.

## "గాజుబొమ్మలు"లో ఘరానా మనుష్యులు

మధుసూదనరావు (ప్రభాకరరెడ్డి) ఆఫీసులో— ఆయనతోపాటు ఎం.ఎల్.ఎ. దీనబంధు (నూతన్ ప్రసాద్), సింహాచలం (సుత్తి వీరభద్రరావు) కూర్చొని ఉన్నారు.

"సారా వ్యాపారమైనా మరే వ్యాపారమైనా — నాక్కావలసింది ఆ వ్యాపారంలో పెట్టుబడెంత, రాబడెంత ?" అడిగాడు మధు.

"కనీసం అయిదు లచ్చలన్నా ఉండాలి. ఇక రాబడంటారా ? అందరికి రూపాయయితే మనకి రూపాయి పావలా వత్తది. సరేనా ?" అన్నాడు సింహాచలం.

"మన సింహాచలానికి ఈ వ్యాపారంలో గొప్ప అనుభవం ఉందిలెండి. ఏం వర్రీ గానక్కర్లేదు !" అన్నాడు ఎం.ఎల్.ఎ. దీనబంధు.

సింహాచలం ఉప్పొంగిపోతూ, "అనుభవం ఏంటి ? అందులో మునిగి తేలినోడ్ని !" అన్నాడు.

మధు కాస్త తగ్గుస్థాయిలో "మునిగినా —తేలినా మా పేర్లు మాత్రం సారాకంపు కొట్టకుండా చూడండి," అన్నాడు.

"ఆఁ... మీ పేర్లు చెప్పకుంటే— నాకేదన్నా లాభమొచ్చుద్దా ? మీ లెవలింగు వేరు. నా లెవలింగు వేరు. అయి కలవ్వు— కలవనివ్వను... సరేనా ?" అన్నాడు సింహాచలం.

"అది సరే...కాగితాలూ అవీ ఎలా రాయటమో తర్వాత చూసుకుందాం. ముందాఁ ఐదు లక్షలు..." అంటూ ఆగాడు దీనబంధు.

మధు వెంటనే చంద్రం (శరత్‌బాబు)ను పిలిచి అర్జంట్‌గా బాంక్‌కు వెళ్ళి అయిదు లక్షలు నగదు తెమ్మంటే, "ఏ అక్కౌంట్‌లో ?" అని అడిగాడు చంద్రం. ఇరుకున పడ్డ మధు "నీకనవసరం... వెళ్ళు !" అన్నాడు. మధు ముఖకవళికలు గమనించిన ఎం.ఎల్.ఎ "అకౌంటంటాడేమిటి ? నాకు చాలా వ్యాపారాలున్నాయి. నేను అడ్జస్ట్ చేస్తానుగా ?" అంటూ లేచాడు.

నటనాలయ కంబైన్స్ 'గాజుబొమ్మలు' చిత్ర కథకుడు, దర్శక నిర్మాత కోవేరు రవీంద్రనాథ్.



'ఏకలవ్య'లో కృష్ణ, జయప్రద

# విశేషాలు

-జి. వి. జి.

## అక్టోబర్‌లో "దాసరి" వజ్రోత్సవాలు!

ప్రముఖ రచయిత, దర్శక నిర్మాత దాసరి నారాయణరావు 60 చిత్రాలను పూర్తిచేసిన సందర్భంగా హైదరాబాద్‌లో వజ్రోత్సవ వేడుకలను భారీఎత్తున నిర్వహించడానికి అఖిలభారత దాసరి అభిమాన సాంస్కృతిక సంస్థల సమాఖ్య నిశ్చయించింది. నిజాం కళాశాల ఆవరణలో జరిగే ఈ ఉత్సవాలలో లక్ష్మీకాంత్ — ప్యారెలాల్ సంగీత విభావరి విశేషాకర్షణ. సెప్టెంబర్ 20 నుంచి ఒక వారంరోజులపాటు దాసరి రూపొందించిన చిత్రాలు ప్రదర్శింపబడతాయి. ఈ సందర్భంగా ప్రచురిత మయ్యే 'దాసరి ప్రత్యేక సంచిక' మాజీ రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డికి అంకితమివ్వబడుతుంది.

## బ్రహ్మంగారికీ తప్పని "సెన్సార్ ట్రబుల్"!

రవిచిత్ర వారి "నిప్పులాంటి మనిషి" చిత్రంలో "మొటిమ" అనే పదాన్ని తొలగించాలని సెన్సార్ సభ్యులు అభ్యంతరం చెప్పి, తీయించేశారు. "ప్రేమ నక్షత్రం"లో సెన్సార్ సభ్యులకు "శోభనం" తప్పుగా ధ్వనించింది. అదేపదం "వా కణ్ణా వా" తమిళ చిత్రంలో వారికి చెడ్డ అర్థాన్ని స్ఫురింప చేయలేదు. "కొద్దిరోజులు పోతే, వీరి దృష్టిలో 'శ్రీరామ' అనేది కూడా బూతుమాట అయిపోతుందేమో!" అని ఓ బాధిత నిర్మాత వ్యాఖ్యానించడం సబబుగానే ఉంది. సెన్సార్‌బోర్డు వారు కొన్ని చిత్రాలకు ఇస్తున్న సర్టిఫికేట్ తీరులు, ఆదేశిస్తున్న కట్స్‌పై అసంతృప్తి ప్రబలి, క్రమక్రమంగా వివాదాలు ఎంత తీవ్రరూపం దాల్చాయంటే — వారి అనుచిత చర్యలను ఖండిస్తూ హైకోర్టులో సవాల్ చేసేవరకు వెళ్ళింది. "శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి చరిత్ర"ను చిత్రీకరించడానికి ముందు దర్శకుడు, ప్రధాన పాత్రధారి ఎన్. టి. ఆర్. కూలంకషంగా ఆ మహనీయుని చరిత్రను పరిశోధించి, ఎంతో జాగ్రత్తగా చిత్రీకరించారు. అయినా, సెన్సార్ కత్తెరకు గురి అయింది. ఆ 'కట్స్' ఏ కారణాల మూలంగా సూచించబడ్డాయో తెలిపి, నిర్మాత వాదన కూడా విని, దానిపై పరిశీలన జరపడం సరైన సాంప్రదాయం. కాని ఈ 'కత్తిరింపుల' కారణాలు రహస్యమైనవంటూ సెన్సార్‌వారు తెలియ జేయడానికి నిరాకరించారు. ఇలా ఏక పక్షంగా సెన్సార్‌వారు నిర్ణయాలు తీసుకోవడం — భావ ప్రకటనా స్వాతంత్ర్యానికి సంబంధించిన ప్రాథమిక హక్కు, వృత్తి స్వేచ్ఛ, వ్యాపార స్వేచ్ఛ నిబంధనలకు విరుద్ధమంటూ ఈ చిత్ర నిర్మాత సవాలు చేస్తూ మద్రాసు హైకోర్టులో రిట్ పిటిషన్ దాఖలు చేశారు.



'పెళ్ళి చూపులు'లో విజయశాంతి

## కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో స్నేహితుల సవాల్

"కృష్ణంరాజు, చిరంజీవి హీరోలు. సెప్టెంబర్ 1న పాటల రికార్డింగ్, 5న షూటింగ్ కార్యక్రమాలు ప్రారంభమవుతాయి," అన్నారు ఆర్.వి. గురుపాదం. ఈయన "వయ్యారిభామలు — వగలమారిభర్తలు" అనంతరం ఆర్. వి. కమల సమర్పణలో నిర్మించే జి. ఆర్. పి. ఆర్ట్స్ "స్నేహితుల సవాల్" చిత్రానికి రాజన్—నాగేంద్ర సంగీతం, పి.ఎస్. ప్రకాష్ ఛాయతో పి.కె. భానోజీరావు నిర్వహణ బాధ్యతలు వహిస్తారు. "ఫస్ట్ షెడ్యూల్ పదిరోజులపాటు జరుగుతుంది. అక్టోబర్ — నవంబర్ మాసాల్లో షూటింగ్ పూర్తయిపోతుంది. సంక్రాంతికి రిలీజ్." అన్నారు కె. ఎస్. ఆర్. దాస్. ఈయన దర్శకత్వంలోనే గురుపాదం తమిళంలో రజనీకాంత్ హీరోగా ఒక చిత్రాన్ని, వచ్చే మార్చిలో కృష్ణ హీరోగా మరో చిత్రాన్ని మొదలెడ్తారు.



'త్రిశూలం'లో శ్రీదేవి, కృష్ణంరాజు



"గోల్కొండ అబ్బులు"లో కృష్ణంరాజు, జయప్రద

## సినిమా

### "పట్నం వచ్చిన పతివ్రతలు"లో పురుష వశీకరణ చిట్కాలు !

దేవి (గీత), లలిత (రాధిక) వాడిన వదనాలతో కూర్చొని ఉన్నారు. "పట్నం పట్నం అని పదే పదే అనడంవల్ల మనం చులకనై పోయాంగాని, వాళ్ళు మాత్రం మారలేదక్కా!" అని లలిత అంటూండగా "నాకు తెలుసమ్మా," అంటూ అరుంధతి (రమాప్రభ) ప్రవేశించింది.

"ఎవరు మీరు ?" అంది దేవి ఎగాదిగా చూస్తూ.

"ఈ ఊళ్ళో పశువుల దగ్గర్నుంచి శిశువుల దాకా వైద్యం చేసే ఏకైక డాక్టర్ని. పేరు అరుంధతి. మీ మగాళ్ళు మిమ్మల్ని పెడుతున్న బాధలన్నీ నాకు తెలుసు...తెలుసుకోవడం నా వృత్తి— అనవసరంగా ఆశ్చర్యపోకండి...అయినా — మీరిద్దరూ ఏం అడిగారని వాళ్ళలా మొండికెత్తారు చెప్పండి ! మీరేమన్నా చంద్రలోకంలో షికారు కెళ్ళాలని అడిగారా ? కాదుగా ? పట్నంలో కాపురం పెట్టాలి అన్నారు. అంతేగా ? మీరు కాబట్టి ఈ చిన్న గొడవనిలా రబ్బరులాగా సాగదీస్తున్నారు. అదే నేనైతేనా... ఎందుకులెండి. నే వస్తాను," అంటూ అరుంధతి పోబోయింది.

"అదేమిటండీ — ఇలా వచ్చి అలా వెళ్ళిపోతున్నారు ?" అంది దేవి.

"మాకేదైనా ఉపాయం చెప్పండి," అంది లలిత.

"చెప్పి ఏం లాభం ? కాని, నే చెప్పినట్టు చేస్తే మాత్రం — మీవాళ్ళు ఖచ్చితంగా మిమ్మల్ని పట్నం తీసుకెళ్ళటం ఖాయం...ఎందుకు నిలబడ్డం? రండి... కూర్చోండి... మగవాడు మన మాట వినేలా చేసుకోవాలంటే — అందుకు మూడు అస్త్రాలున్నాయి... అస్త్రాలంటే — బాణాలు... నెంబర్ వన్ : కాకా బాణం. కాకా అంటే తెలుసుగా ? భజన... ఆ బాణం ప్రయోగించే దశరథ మహారాజు దగ్గర కైకేయి మూడు వరాలు పట్టేసింది..." అని అరుంధతి అంటూండగా "అప్పటికీ లొంగకపోతే ?" అని ఆదుర్దాతో అడిగింది దేవి. అరుంధతి గొంతు సవరించుకొని తన బోధనను కొనసాగించింది : "విప్లవ బాణాన్ని వదులుతాం... అంటే — మగవాళ్ళు చెప్పింది మనం చెయ్యకూడదు. తినే వంటలున్నాయి చూశారూ — అవన్నీ పాడుచేసెయ్యాలి. ఎలాగూ వాళ్ళకి కోపం వస్తుంది కదా ?... దాంతో ఫైట్..."

లలిత దిగాలుగా ముఖం పెట్టి, "అదీ చేసేశామండీ," అంది.

"అయితే నెంబర్ త్రీ — మూడో బాణం" అంటూ వాళ్ళిద్దరి చెవుల్లో అరుంధతి గుసగుసలాడేసరికి వాళ్ళిద్దరి ముఖాలూ వికసించాయి; చూపుల్లోనే అరుంధతికి కృతజ్ఞత అర్పించుకున్నారు.

చిరంజీవి, మోహన్‌బాబు నాయకులుగా విజయబాపినీడు నిర్మాణతలో అట్లూరి రాధాకృష్ణమూర్తి, కొమ్మన నారాయణరావు నిర్మించిన శ్రీనివాస ప్రొడక్షన్స్ "పట్నం వచ్చిన పతివ్రతలు" చిత్రం త్వరలో విడుదలవుతుంది. జంధ్యాల, కాశీ విశ్వనాథ్ రచయితలు. ప్రసాద్ ఛాయ, సత్యం సంగీతం, కళాధర్ శిల్పం, కె. సత్యం కూర్పుతో మౌళి దర్శకుడు.

### శ్రీ సారథీ స్టూడియోస్ రజతోత్సవం!

హైదరాబాద్‌లో తెలుగు చలన చిత్ర పరిశ్రమాభివృద్ధికి శ్రీ సారథీ స్టూడియోస్ ఎంతో దోహదం చేసింది. పాతికేళ్ళ క్రితం 1957లో హైదరాబాద్‌లో నెలకొల్పబడిన ఈ స్టూడియోలో తొలి చిత్రం "మా ఇంటి మహలక్ష్మి" నుంచి అక్టోబర్‌లో విడుదలయ్యే "పెళ్ళిచూపులు' చిత్రం వరకు ఎన్నో చిత్రాలు నిర్మింపబడ్డాయి. ఈ సందర్భంగా హెచ్.ఎం.వి. సంస్థ హైదరాబాద్‌లో తయారైన సారథి చిత్రాలన్నింటిలోని హిట్‌సాంగ్స్‌ను ప్రత్యేకంగా ఎల్. పి. రికార్డుగా పొందుపరచి త్వరలో విడుదల చేయబోతోంది.

### పెళ్ళిచూపులు

"మా 15వ చిత్రానికి 'పెళ్ళిచూపులు' అని పేరు పెట్టాం. ఆగస్టు నెలాఖరులోగా షూటింగ్ పూర్తయిపోతుంది. అక్టోబర్ మొదటి వారంలో రిలీజ్ చేయాలనుకుంటున్నాం !" అన్నారు నిర్మాత పి. శశిభూషణ్. చంద్రమోహన్, విజయశాంతి, సత్యనారాయణ, గుమ్మడి, హేమచందర్, సూర్యకాంతం, అన్నపూర్ణ, మోహిని, అత్తిలి లక్ష్మి పాత్రధారులు. భాగ్యరాజా కథకుడు. డి.వి. నరసరాజు సంభాషణలకర్త. మహదేవన్ స్వరకల్పనలో ఆత్రేయ, జ్యోతిర్మయి గీతాలు రాశారు. బాబాఆజ్మి ఛాయ, వెంకటేశ్వరరావు కూర్పుతో పి.సాంబశివరావు దర్శకుడు.

## శోభన్‌బాబు, చంద్రమోహన్ నటించే బలిదానం షూటింగ్ ప్రారంభం

"మా పిక్చర్‌లో రచయిత కాశీ విశ్వనాథ్ కూడా ఓ ముఖ్యపాత్ర ధరిస్తున్నారు," అన్నారు రూపశిల్పి పోతరాజు. ఈయన ఆధ్వర్యంలో వి. రాజ ప్రసాద్ సమర్పించే సంతోష ఆర్ట్స్ మూవీస్ "బలిదానం" చిత్రం షూటింగ్ జూలై 30 నుంచి జరుగుతోంది. శోభన్‌బాబు, మాధవి, చంద్ర మోహన్, రావుగోపాలరావు, జగ్గయ్య, గుమ్మడి, నూతన్‌ప్రసాద్, ప్రసాద్‌బాబు, అల్లురామలింగయ్య, సాక్షిరంగారావు, మిక్కిలినేని, బాలకృష్ణ, సి. హెచ్. కృష్ణమూర్తి, నవకాంత్, పెమ్మసాని రామకృష్ణ, శశిపూర్ణిమ, జయమాలిని, కాకినాడశ్యామల, నిర్మల నటిస్తున్నారు. శోభ కథకురాలు. కాశీ విశ్వనాథ్ మాటలూ, చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి పాటలూ రాశారు. చెంగయ్య ఛాయ, సోమనాథ్ శిల్పం, గౌతమ్‌రాజు కూర్పు, దాసరి కృష్ణమూర్తి నిర్వహణలో ఎ. శ్రీనివాస్, ఎ. లక్ష్మణరావు నిర్మాతలు. "సెప్టెంబర్‌లో జరిగే రెండో షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు స్క్రీన్‌ప్లే దర్శకత్వం వహించే ఎస్. ఎ. చంద్రశేఖర్.



'వెలవంక'లో తులసి, రాజేష్

## సినిమా

'ఆంధ్రకేసరి'లో విజయచందర్, మురళీమోహన్

## ఎ. ఎన్. ఆర్. హీరోగా కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో చలసాని గోపి నిర్మించే చిత్రం

"నవంబర్ డిసెంబర్‌లలో 1వ తేదీనుంచి 10వ తేదీవరకు, జనవరిలో 11నుంచి 21 వరకు షూటింగ్ షెడ్యూల్స్," అన్నారు ఛలసాని గోపి. ఈయన విజయదుర్గా పిక్చర్స్ బానర్‌లో నిర్మించే చిత్రంలో ఎ. ఎన్. ఆర్; జయసుధ, రాధిక, సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లురామ లింగయ్య ప్రభృత తారాగణం. సత్యానంద్, వేటూరి, చక్రవర్తి, కె. ఎస్. ప్రకాష్, భాస్కరరాజా, సలీం, కోటగిరి వెంకటేశ్వరరావులు తెరవెనుక కృషిచేస్తారు.

## చలం చిత్రంలో చిరంజీవి హీరో

"రాఘవేంద్ర క్రియేషన్స్ బ్యానర్‌లో కొత్త పిక్చర్ మొదలెడుతున్నాను," అన్నారు చలం. చిరంజీవి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, నూతన్ ప్రసాద్, అల్లు రామలింగయ్య, త్యాగరాజు, పి. ఎల్. నారాయణలతోపాటు చలం కూడా ఓ కీలకమైన పాత్రలో కనిపిస్తారు. రాజశ్రీ మాటలు, పాటలు రాస్తున్నారు. రామకృష్ణంరాజా సంగీతం, మధు ఛాయ, రవి కూర్పులో కె.ఎస్. రామిరెడ్డి దర్శకుడు.




లింటాస్. L. 73-149 TL

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

సీరియల్

# ధర్మో రక్షతి రక్షితః

## ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ

6

(గత సంచిక తరువాయి)

కృష్ణశాస్త్రి ఉరుములేని పిడుగులా ఊడిపడ్డాడు తమ్ముడిరాక దీక్షితులుగారికి ఆనందం కలిగించినా, తమ్ముడు ఏదో చిక్కుల్లో వున్నాడని చూడగానే అర్థం అయింది పెద్దకూతురి పెళ్ళి నిశ్చయమైందని చెప్పేడు అంతా ఆనందించేరు కృష్ణశాస్త్రి తను వచ్చిన పని బయట పెట్టలేక పోయాడు ఏదో అన్నగారికి చెప్పాలి మాట్లాడాలన్నట్టు వచ్చికూర్చుంటాడు అదీఇదీ మాట్లాడతాడు కానీ ఏదో చెప్పబోయినట్లు చెప్పటానికి ఇబ్బంది పడుతున్నట్లు ఆగిపోతాడు

దీక్షితులుగారు గ్రహించిన తరువాత అడిగేరు "ఏరా ఏంటి విషయం ? నువ్వు ఏదో పనిమీద వచ్చేవని నిన్ను చూడగానే అర్థమవుతోంది పెళ్ళి కుదిర్చేవుకదా డబ్బు ఇబ్బందిగా వుందా ?" అడిగేరాయన

కృష్ణశాస్త్రి "ఔ"నన్నట్టుగా తలూపేడు

దీక్షితులుగారు మరేం ప్రశ్నించలేదు మాట్లాడలేదు ఏం మాట్లాడటానికి తన దగ్గర డబ్బు లేదు తనేరకంగానూ తమ్ముడికి సాయం చేయలేడు అన్నదమ్ముల మధ్య అనుబంధం ఎంతవున్నా, కృష్ణశాస్త్రి ఆర్థిక పరిస్థితి గురించి దీక్షితులుగారికేమీ తెలియదు

"కట్నం ఆరువేలు నా జీతంలో మదుపు పెట్టింది, చిల్లర మల్లరా పోగుచేసి సరిపెట్టగలనన్నయ్యా కాని పెళ్ళిఖర్చులకు ఎంత లేదన్నా నాలుగువేలు చేతోత్త పట్టుకోవాలి ఆ విషయమే ఆలోచిస్తున్నాను నీ దగ్గర ఏంలేదని నాకూ తెలుసు కాని నీ మాటమీద మన ఊళ్ళో ఎక్కడైనా ఋణం దొరికితే నెమ్మదిమీద తీర్చుకోవచ్చని ఆలోచిస్తున్నాను" నెమ్మదిగా అన్నాడు కృష్ణశాస్త్రి

దీక్షితులుగారికి నోటమాట రాలేదు నాలుగువేలు అప్పు ఎక్కడ పుడుతుంది ? శివరామయ్యలాంటి మహావ్యక్తి వుంటే నాలుగువేలు నాలుగు నిమిషాల్లో పుట్టించగలడు తను ఆనందరావు తండ్రి రక్తాన్ని పంచుకున్నాడు అయితే ఔదార్యాన్ని పంచుకోలేదు వ్యాపారదక్షతనే ఎంచుకొన్నాడు తనివ్వవలసిన డబ్బుకి నోటు రాయించుకున్నాడు వడ్డీ కడుతున్నాడు అప్పుడు అప్పుడు ఈ మధ్య అప్పుగా ఇచ్చిన డబ్బు కలిపితే అయిదువేలు రెండు రూపాయల వడ్డీతో పాపం పెరిగినట్టుగా పెరుగుతోంది ఆదాయం తగ్గింది వ్యయం పెరిగింది పలుకుబడి తగ్గుతోంది తనెక్కడ పుట్టించగలడు ?

నిజానికి కృష్ణశాస్త్రి తనని అడగటం విధాయకం ఈ ఇల్లు పిత్రార్జితం అన్నదమ్ముల మధ్య పంపకాలు లేవు ఈ ఇంట్లో సగభాగంమీద హక్కు అతనికుంది అయితే పట్నం కాపురంవల్ల ఇంతకాలం పెద్దగా ఈ ఇంటి పంపకం విషయం పట్టించుకోలేదు

"ఏమిటన్నయ్యా ! ఆలోచిస్తున్నావు ?"

"ఏముందిరా ! నా మాట విలువమీద అప్పు ఇచ్చేరోజులు గతించేయి ఇకపోతే ఆస్తిగా మన తండ్రిగారు మనకిచ్చింది ఈ ఇల్లు దీనిమీద నాకెంత హక్కుందో నీకూ అంతేవుంది అందువల్ల దీనిమీద ఋణం చేయడంకంటే మార్గాంతరం తోచదు"

"ఈ ఇంటి మీద ఋణం చేయడమా ?" విస్మయంగా అడిగేడు కృష్ణశాస్త్రి

దీక్షితులుగారు మాట్లాడలేదు

"ఇది వేదనిలయం అన్నయ్యా ! నాన్నగారి కాలంనుంచీ ఈ లోగిల్లో ఎన్ని వేదాంత చర్చలు ? ఎంత వేది పఠనం జరిగింది ?" ఆవేశంగా అన్నాడు కృష్ణశాస్త్రి

"కావచ్చు కాని అవేం మన అవసరాలు తీర్చలేవుగా నా మీద, ఇంటిమీద వున్న గౌరవం కొద్దీ నువ్వామాట అంటున్నావు సంతోషం కాని పంపకాలు చేసుకుంటే నీ లవసరం గడిచిపోవచ్చు ఈ ఊళ్ళో నీకు ఇల్లు వుండి ప్రయోజనం లేదు అనుభవం నా క్రిందే వుంది కనుక నేను నిమ్మకు నీరెత్తినట్లు కూర్చోవటం సబబు కాదు" తేల్చి చెప్పేరు దీక్షితులుగారు

కృష్ణశాస్త్రి మాట్లాడలేదు పంపకాల ప్రసక్తి అతనికి ఇబ్బందిగా తోచింది

మరెక్కడా అప్పు దొరకనప్పుడు కృష్ణశాస్త్రికి గట్టిగానే చెప్పింది తాయారు

"మనకేదైనా జానెడు జాగా, నిలువనీడా వుందంటే అక్కడేకదా! వెళ్ళి ప్రయత్నం చేయండి అప్పు అంటూ పుడితే అక్కడే పుట్టాలి లేదా మన వాటాని తెగనమ్మేసిరండి వెయ్యేళ్ళకయినా వేరుండటాలు తప్పవు అన్నదమ్ములయిన తర్వాత పంచుకోక తప్పదు" అందామె

కాని అన్నగారు పంపకాల విషయం ఎత్తగానే ఇబ్బందిగా తోచింది అతనికి

"పంపకాలూ అంపకాలూ ఎందుకన్నయ్యా రిటైర్ అయిన తరువాత వచ్చి ఇక్కడ పడుండాల్సిందేగా పోనీ మాట విలువమీద అప్పు ఇవ్వకుంటే ఇంటిమీద చేద్దాం" అన్నాడు కృష్ణశాస్త్రి

"సరే ఆనందరావుని అడుగుదాం మనం ఇద్దరం సంతకాలు పెడితే ఇస్తాడేమో " అన్నారు దీక్షితులుగారు

ఆనందరావు అంతసులువుగా కొరుకుడు పడలేదు "మీరిద్దరూ సంతకం పెడితే ఇంటిమీద తనఖా దస్తావేజు రాయించుకుని అప్పు ఇవ్వటానికే ఆక్షేపణలేదు నిక్షేపంలాంటి ఇల్లు ఎంత మనూర్లో ఇంటి విలువ తక్కువైనా పదిహేను వేలకి కిమ్మత్తు చేస్తుంది కాని అంతసొమ్ములేదే ఉన్న సొమ్మంతా మిల్లుమీద నిలబడిపోయింది బియ్యం వ్యాపారం పడిపోయింది

"అది కాదయ్యా ఆనందరావు ఈనాటి వరకూ నేను ఋణానికి వచ్చింది నీ దగ్గరకే మరొకరు నాకు తెలియదు అంచేత నువ్వే ఏదోలా చూడాలి" దీక్షితులుగారు ప్రాధేయపూర్వకంగా అడిగేరు

కృష్ణశాస్త్రి అన్నగారి పక్కన కూర్చుని వున్నాడు అతనేం మాట్లాడలేదు

"ఉంటే ఇవ్వడానికేమండీ ! మీరెటూ నాకు అయిదువేలు పైచిలుకు బాకీ వున్నారు మిగిలిన

**జరిగిన కథ — 6** యజ్ఞన్న దీక్షితులు సనాతనుడు ఆయన భార్య లలితాంబ వారి సంతానం పరమేశ్వరశాస్త్రి, శ్రీరాముడు,గౌతమ శాస్త్రి, మీనాక్షిలు పరమేశ్వరశాస్త్రి తండ్రివద్దనే వేదాధ్యయనం చేస్తుంటాడు శ్రీరాముడు అమలాపురంలో చదువుకొంటానంటాడు దీక్షితులు పెద్దకుమారుడు పరమేశ్వరశాస్త్రికి, ధూళిపాళ సోమయాజులు ప్రథమ పుత్రిక సుబ్బలక్ష్మికి బాల్య వివాహం జరిపిస్తారు గృహప్రవేశం అనంతరం పనిలో పనిగా గౌతమ శాస్త్రికి ఉపనయనం కూడా జరిపించేస్తారు దీక్షితులుగారు సోమిదేవమ్మ మరణంతో ఓ తరం మారిపోతుంది శ్రీరామ్ ఎస్ ఎస్ ఎల్ సి పాసవడంతో పాలిటెక్నిక్ చదువుతానంటాడు దీక్షితులుగార్కి ఇష్టం లేకపోయినా లలిత నచ్చచెప్పడంతో అంగీకరిస్తారు తన చదువు అయ్యేవరకూ పెళ్లి చేసుకోనని తండ్రితో ఖచ్చితంగా చెప్పేస్తాడు శ్రీరామ్ తన కూతురి పెళ్లి కోసం అప్పు కోసం ఆనందరావ్ దగ్గరకు వెళ్లిన దీక్షితులు ఎన్నడూ ఊహించని విధంగా అవమానం పాలౌతాడు శ్రీరామ్ చదువు పూర్తయినా రికమెండేషన్, డబ్బూ లేకపోవడంతో పాటు కులం పెద్దదవడంవలన వుద్యోగం రాదు హరిజనుడయిన ఏడుకొండలుకు ఉద్యోగం వస్తుంది అదే ఉద్యోగం కోసం అప్లై చేసిన, అన్నింటిలో అతనికంటే ఆధిక్యతలో వున్న శ్రీరామ్‌కు మాత్రం కులం కారణంగా రాదు

మొత్తం ఇచ్చి ఇంటి తనఖాకు పదివేలు నేనే రాయించుకుందును ''

దీక్షితులుగారు ఆనందరావు మాటలకు ఆశ్చర్య పోయారు ఇంతవరకూ తనకిచ్చిన సొమ్ము నోటు మీదనేవుంది అయితే ఆ సొమ్ము ఈ సొమ్ము కలిపేసి అన్నదమ్ములిద్దరిచేత తనఖా రాయించుకుంటే మంచిదని చూస్తున్నాడు

''పోనీ అలాగే కానియ్ మొత్తం పది వేలకు తనఖా రాస్తాము ఆ డబ్బును నువ్వేఇవ్వు ''

మిల్లులో సరుకు ఆడటంలేదు రొటేషన్‌లేదు

అతనా ఊర్లో కొబ్బరికాయకొని ఎగుమతి చేస్తున్న వ్యాపారస్తుడు ఇటీవలనే అతనా ఊరు వచ్చేడు

ఆనందరావు అతన్ని అన్నదమ్ములకుచూపిస్తూ

''ఈయనపేరు భైరవమూర్తిగారు ఈయన సొమ్మివ్వగలరు అయితే వీరొక మాట అన్నారు అదట్టే నా కంగీకారంగా తోచలేదు అందుకే మీ



దగ్గరకు తీసుకువచ్చేను '' అన్నాడు

''ఏమటి ?''

''ఈయన డబ్బివ్వటానికి సుముఖంగానే వున్నారు అయితే ఆయన వ్యాపారానికి ఇప్పుడు నాయుడుగారి అరుగుమీద కొట్టు చాలటంలేదు కొబ్బరికాయ నిల్వకీ దానికి ఇబ్బందిగా వుందిట ఇంటిని స్వాధీనపు తనఖా ఇస్తే డబ్బు ఇస్తారుట '' చెప్పేడు ఆనందరావు

అంచేత ఓ పని చేయండి నేను వేరేచోట పదివేలకు తనఖా మాట్లాడతాను నా డబ్బు నాకు పారేసి మిగిలింది మీరు తీసేసుకోండి నా అవసరం గడు స్తుంది మీ ఇబ్బంది తీరి పోతుంది '' అన్నాడు ఆనందరావు

అన్నదమ్ములిద్దరూ తలూపక తప్పలేదు

''అయితే ఇక్కడే కూర్చోండి ఇప్పుడే వస్తాను'' అంటూ వెళ్ళేడు ఆనందరావు

గంట తర్వాత ఊడిపడిన ఆనందరావు వెనుకనే మరొకాయన వచ్చేడు







"అంటే" అడిగేడు కృష్ణశాస్త్రి

"మీరిల్లు ఖాళీ చేసి ఆయనకివ్వాలి ఆయన అందులో వుంటారు మీ ఇంటికి అద్దె వుండదు వారి డబ్బుకు వడ్డీ వుండదు మీరెప్పుడు డబ్బిస్తే అప్పుడు ఖాళీచేస్తారాయన" నెమ్మదిగా తలొంచుకుని చెప్పేడు ఆనందరావు

కృష్ణశాస్త్రికి పట్టలేనంత కోపం వచ్చింది తమ ఇల్లు ఖాళీ చేసి ఇవ్వాలా ? ఒక్కసారిగాలేచి

"అక్కర్లేదు సెలవు" అంటూ చేతులు జోడించి గుమ్మంకేసి నడిచేడు విసురుగా

"కృష్ణా ఒరేయ్" పిల్చేరు దీక్షితులుగారు

"రా" అంటూ కృష్ణశాస్త్రి కోపంగా వెళ్ళిపోయాడు భైరవమూర్తి కృష్ణశాస్త్రి వెళ్ళిన వైపుచూస్తూ

"వస్తానండీ ఆనందరావుగారు వాళ్ళకా విధంగా ఇష్టమైతే నేను పదివేలు ఇస్తాను కబురు పెట్టండి" అంటూ వెళ్ళిపోయేడు

దీక్షితులుగారికి దిక్కుతోచక కూర్చుండి పోయేరు ఆయనకేం పాలుపోవటంలేదు

వెళుతున్న భైరవమూర్తిని చూస్తూ ఆనందరావు దీక్షితులుగారి పక్కన కూర్చుంటూ

"క్షమించండి దీక్షితులుగారు మీరు మా నాన్నకు చేసినసాయం మా నాన్న నాకు చెప్పేడు అలాంటిది ఇప్పుడు మీకు నేనేవిధంగానూ ఉపయోగ పడలేకపోతున్నాను తండ్రిలాంటివారు మీ దగ్గర నిజం చెప్తున్నాను అక్రమ లాభాలకు ఆశపడి పట్టు బడటం వల్ల మిల్లుకు ప్రభుత్వం సీలువేసింది వ్యాపారంలో అవకతవకల వల్ల చిక్కుల్లో ఇరుక్కున్నాను ఎక్కడచూసినా చేయి అందించే ఆసరాలేదు బంధువులు నవ్వుతున్నారు తప్ప సాయం చేయటానికి రావటంలేదు అందువల్ల నన్ను అర్థంచేసుకొమ్మని నా మనవి"

దీక్షితులుగారు అతని స్థితిని కరిగి పోయేరు

"బాధ పడకయ్యా ! నిజాయితీతో మనం వ్యవహరిస్తే అన్నీ అవేచక్కబడతాయి నీక్కు మేలు కలగాలని ఆ భగవంతుని ప్రార్థించటం మినహాయించి నేనేం చేయలేను ఇక అవసరంలో వున్నప్పుడు నీ డబ్బు నీకు ఇవ్వకపోవడం అన్యాయం ఆ భైరవ మూర్తిని పిలు తమ్ముడికి నచ్చచెపుతాను స్వాధీనపు తనఖానే ఇద్దాం." అన్నారు దీక్షితులుగారు

"నా కోసం మీరా తనఖా సమ్మతించకండి

# ధర్మో రక్షతి రక్షితః

ఏనాడయితే బ్రాహ్మణ ద్రవ్యానికి ఆశించి మీ చేత ఆనోటు రాయించేనో ఆనాడే సగం చచ్చేను మీ చేత ఈ పని చేయించడానికి నాకు మనసొప్పటం లేదు" ఆవేశంతో కదిలిపోతూ అన్నాడు ఆనందరావు

అతని వాత్సల్యానికి కరిగిపోయిన దీక్షితులుగారు "అలా కాదయ్యా ! నీ డబ్బు నీ కివ్వటం నీకు చేసే సాయం కాదే అయినా నువ్వున్న చిక్కు పరిస్థితిలో నీ తండ్రే వుంటే చేతులు ముడుచుకుని కూర్చుంటాడా ? మనసులో దిగులు పెట్టుకోకు ఏర్పాట్లుచూడు నీకు మేలు కలుగుతుంది" అంటూ లేచారు

ఆనందరావు దీక్షితులుగారికి పాదాభివందనం చేస్తూ "దీవించండి మీవంటి వేదమూర్తుల మాట తీరుపోదు" అన్నాడు

దీక్షితులుగారికి కృష్ణశాస్త్రిని ఒప్పించటమే కష్టమైంది చివరకు అన్నగారిమాటకు ఎదురు చెప్పలేని పరిస్థితిలో అతనికి అంగీకరించక తప్పింది కాదు

వ్యాఘ్రేశ్వరశర్మగారింట్లో ఓ భాగంలో దీక్షితులుగారుండటానికి నిశ్చయించుకుని, పదివేలకు ఇల్లు భైరవమూర్తికి స్వాధీనపు తనఖామీద సంతకం పెట్టి, తమ్ముడిచేతకూడా పెట్టించేరు

## 7

శర్మగారింట్లోకి మారిపోయిన తరువాత దీక్షితులుగారికి కొత్త ఇబ్బందులు ఎదురయ్యేయి

శర్మగారు బ్రతికుంటే ఏం చేసునో కాని శర్మగారి అల్లుడు పేరయ్యశాస్త్రి నలభై రూపాయలు అద్దె విషయం ముందే చెప్పాడు

పైగా దీక్షితులుగారు నిత్యాగ్నిహోత్రులు కావడంతో, పూర్వీకుల నిర్మాణంలో కట్టిన ఇంట్లో ఆగ్నేయ దిశలో యజ్ఞవాటిక వుండేది

శర్మగారింట్లో అగ్నిహోత్రానికి ప్రత్యేకమైన గదిలేక ఆయన ఇబ్బంది ఎదుర్కోవలసి వచ్చింది అందువల్ల ఆగ్నేయ దిశలో ఒక పాక వేయించి, అగ్నిగుండం ఏర్పాటు చేసుకున్నారు

నిత్యానుష్టానాలు పూర్తయినా కూడా ఆయన బయటకు రావటంలేదు అక్కడే వేద పఠనం చేస్తూ పొద్దు వెళ్ళబుచ్చుతున్నారు

అన్నం గిన్నె తీసుకుని పాకకేసి వెళ్తున్న లలితాంబని ప్రశ్నించేడు గౌతమశాస్త్రి

"ఎక్కడికమ్మా అన్నం నాన్నగారు అక్కడే భోంచేస్తారా"

"భోజనం ఏమిట్రా నీ తలకాయి పౌర్ణమి అన్నహోమానికి" అందామె

"ఇంకా ఆయనకీ చాదస్తం పోదా ? అంత అన్నం ఆ నిప్పుల్లో పారేస్తేగాని ఆయనకు మనసుకు శాంతి వుండదా ?"

"గౌతమా !" ఆశ్చర్యంగా అంది లలితాంబ

"లేకపోతే ఏమిటమ్మా ! ఇంట్లోవాళ్ళు తిండి లేక అల్లాడుతూ ఏపూట బియ్యం ఆ పూట తెచ్చుకుంటూంటే అగ్నిహోత్రుడు అన్నం ఏమిటమ్మా ?"

అటుగా వచ్చిన పరమేశ్వరశాస్త్రి వణికిపోతూ "అపచారం అపచారం ఏమిట్రా ఆ మాటలు!" అన్నాడు

"అవునురా బ్రతికున్న వాళ్ళకు దిక్కులేదు ఎప్పుడో గతించిపోయిన పితృదేవతలకు తర్పణాలూ ఔపాసనలు , ఇంద్రాది దేవతలకు హవిర్భాగాలూ చాలా బాగుంది ! రోజూ ఇన్నిబియ్యం తగలబెట్టడం, చేతిమీదకి నెయ్యిలేకుండా నిప్పుల్లోపోయడం ఇది నేరం అంతేకాదు పరమ వేష్ట"

పరమేశ్వరుడు, లలితాంబ దెయ్యం పట్టినట్టు చూస్తూ వుండిపోయారు

"ఏం ! ఇంతకాలం దేవతలకు హవిర్భాగాలిస్తున్నాడే ఏదేవుడొచ్చి రక్షిస్తున్నాడు మన్ని ? ఏ పితృదేవతలొచ్చి మన కడుపునింపుతున్నారు అన్నమో రామచంద్రా ! అని అఘోరిస్తే కడుపు నిండా అన్నమయినా లేని అభాగ్యులు చాలా మంది వున్నారు దేశం నిండా వాళ్ళల్లో ఒక్కరికి పిడికెడన్నం పెట్టినా ఆనందిస్తారు" ఆవేశంగా అంటున్న గౌతమశాస్త్రి వాక్ప్రవాహానికి లలితాంబ చెళ్ళున దవడమీద ఒకటి వేయడంతో అడ్డుకట్ట పడింది

గౌతమశాస్త్రి కళ్ళనీళ్ళు తిరిగేయి

విసురుగా వచ్చి కొట్టడంలో లలితాంబ చేతిలో అన్నంగిన్నె జారి నేలపాలైంది

గౌతమ్ తలెత్తాడు

అపరరుద్రుడిలా గుమ్మంలో నిలబడి వున్నారు దీక్షితులుగారు ముక్కంటి మూడోకన్ను తెరిచినట్లు ఆయన చూపుల్ని గౌతమ్ మీదకు, భార్య మీదకు, నేలపాలైన అన్నంగిన్నె మీదకు తిప్పేరు

ఆయన నోట మాటరాలేదు కొన్నిక్షణాలు ఆవేశంగా చూసి

"యజ్ఞఫలాన్ని కుక్క ముట్టుకుంది లలితాంబ" అన్నారాయన గౌతమ్‌కేసి చూస్తూ ఆ తర్వాత గిరుక్కున వెనుకకు తిరిగి తన యజ్ఞశాలకు వెళ్ళిపోయేరు

"నువ్వేమయినా తెచ్చి ఒలకపోస్తున్నావా? ఏమిట్రా? ఆ వాగుడు భ్రష్టుడా" అంది లలితాంబ

గౌతముడు తల దించుకున్నాడు

"ఇంట్లో వున్న బియ్యం కాస్త వండేశాను మావగారి హోమానికి" అంది సుబ్బలక్ష్మి

"ఇదిగో మళ్ళీ తెచ్చేను" అంగవస్త్రం మూట విప్పుతూ అన్నాడు పరమేశ్వరశాస్త్రి

గౌతముడు తలొంచుకుని బయటకు వెళ్ళిపోయాడు

లలితాంబ మళ్ళా స్నానం చేసి శుచిగా వండి తీసికెళ్ళింది దీక్షితులుగారా అన్నాన్ని ముట్టలేదు ఉచ్ఛస్వరంతో వేదపారాయణ చేస్తూ వుండిపోయేరు

చాలాసేపు అక్కడే నిలబడిన లలితాంబ భర్త తీవ్రస్వరంతో వేదపారాయణ చేస్తూ వుండటాన్ని గమనిస్తూ వుండిపోయింది

వేదపారాయణలో నిమగ్నులయిన దీక్షితులుగారు ఆ రోజుకి ఇక అక్కడనుంచీ కదలలేదు

పరమేశ్వరుడు తండ్రిని పలకరించడానికి వెళ్ళేడు వేదపారాయణ వింటూ అప్రయత్నంగా తనూ గొంతు కలిపి తండ్రి పక్కన చతికిలపడ్డాడు

వేదం వాళ్ళిద్దరి నోటినుంచి అమృతవాహినిలా పొంగుతోంది కాస్త దూరంలో లలితాంబ, వెనక చంటిపిల్లనెత్తుకొని సుబ్బలక్ష్మి, మీనాక్షి నిలబడివున్నారు మూడేళ్ళ యజ్ఞన్న నిలబడి, తాతకేసి, తండ్రికేసి చూస్తున్నాడు

దూరంగా నిలబడి అటే చూస్తున్నారు శ్రీరామ్, గౌతములు ఇద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు గౌతమ్ తల దించుకున్నాడు

మూడేళ్ళ యజ్ఞన్న "తాతా" అంటూ అడుగు ముందుకెయ్యబోయాడు కాని ఆగిపోయేడు

దీక్షితులుగారి వేదఘోష అలా సాగుతూనే వుంది కొనసాగుతూనేవుంది

# భాగం - 4

వేణుగోపాలస్వామి గుడి కొచ్చింది మీనాక్షి గుడినిండా ఇసక వేస్తే రాలకుండా ఉంది జనప్రవాహం తీర్థం జరుగుతున్నంత హడావిడిగా వుంది అంత హడావిడి సాధారణంగా కృష్ణాష్టమి నాడు జరుగుతుంది లేదా రథసప్తమికి జరుగుతుంది రథసప్తమినాడు రథోత్సవం జరుగుతుంది అప్పుడు చుట్టుపక్కల జనాభా కూడా ఆ ఊరికొస్తారు పాకలు, పందిరిలు వేస్తారు అరటిపళ్ళు దుకాణాలు, తినుబండారాలు, రంగులరాట్నాలు, బండివేషాలు అంతా హడావిడే! ఊరు స్వరూపమే మారిపోతుంది

ఇప్పుడు రథోత్సవం కాదు గోకులాష్టమి కాదు కాని ఊరంతా హడావిడి భక్తి పరవశత్వం పదేళ్ళుగా మీనాక్షి అంత హడావిడి గుడి దగ్గర ఎప్పుడూ చూడలేదు పర్వదినాల్లో గుడికొచ్చే భక్తుల సంఖ్య ఎక్కువే అయినా ఇంత జనసమూహం ఎన్నడు లేదు అంత హడావిడికి కారణం అవధూత కృష్ణానందుల రాకే

కృష్ణానందులు కృష్ణాతీరంవారు అవధూతలు కాకముందు వారొకసారి ఆ గ్రామాన్ని సందర్శించేరు భగవద్గీతమీద ఉపన్యసించేరు కాని ఆనాడింత జనసమూహం లేదు

ఇప్పుడెక్కడ చూసినా జనసమూహమే వారు భగవద్గీతను ఆంగ్లంలోకి అనువదించేరు భగవద్గీత మీద ఆంగ్ల, తమిళ, కన్నడ, బెంగాలి, హిందీ, తెలుగు భాషల్లో ఉపన్యసించగలరు

నిలువెత్తు మనిషి ఒంటినొక కౌపీనం ఆయనే భాషలో ఉపన్యసించినా ఉపన్యాసం ఇవ్వటమే కాదు ప్రతి శ్లోకాన్ని వివరించి నేటి సమకాలీన పరిస్థితికి ముడి పెట్టి భక్తుల్ని ఉత్తేజితుల్ని చేయగలరు

అవధూతలు ఏ ఊరు దర్శించినా సంపన్న గృహస్థులు ఒక్కొక్కరోజు ఒక్కొక్కరింట్లో భిక్ష ఏర్పాటుచేస్తారు ఆయన ముందురోజు వేదపారాయణ జరుగుతుంది తదనంతరం అవధూతలు భిక్ష ఏర్పాటు చేసిన గృహస్థుకేసి చూస్తారు ఆ భక్తుడు ఆ వేదవిప్రులను ఆయన సముఖంలో సత్కరిస్తాడు

మీనాక్షికి అవధూతరాక ఎంతో ఆనందాన్ని కల్గించింది అవధూతలు ఉన్నంతకాలం దుర్భరమైన ఆకలిబాధ ఉండదని సంతోషించింది

అవధూత కృష్ణానందులుకి గతంలో యజ్ఞన్న దీక్షితులుగారితో స్వల్ప పరిచయం ఉండటంచేత పెద్దలు వారికి వర్తమానం చేశారు, ఉదయమే వేదపారాయణ జరపమని

దీక్షితులుగారు స్వగృహం వదిలి ఎప్పుడైతే వ్యాఘ్రేశ్వరశర్మ ఇంటికొచ్చి అద్దెకుండటం మొదలెట్టారో ఈ మూడేళ్ళుగా ఆయనలో వైరాగ్య ఛాయలు పొడచూపటం మొదలెట్టాయి ఉదయం స్నానాధికాలు ముగించుకుని యజ్ఞవాటికలోకి వెళ్ళిపోవటం అపరాహ్ణము దాటినవెనుక వెలుపలికి రావటం, చేస్తే భోజనం చేయటం అదీ ఏకభుక్తవాసమే

అందుకే గ్రామపెద్దలు వర్తమానం చేసినా, తనురాలేనని, తన కుమారుడు వేదపఠనం చేస్తాడని అన్నారాయన

ఉపన్యాసానికి నిర్ణీతం కాలంలోవెళ్ళి ఆసీనులు కావటానికి జనం ఆరాటపడుతున్నారు గుడిముందు తొక్కిసలాట ప్రారంభమయింది

గుడిముందు యువకులు కొందరు జనాన్ని అదుపులో ఉంచటానికి ప్రయత్నం చేస్తున్నారు వాళ్ళంతా తెల్లని లుంగీ కట్టుకుని పైన లాల్చీ వేసుకున్నారు గుండెలమీద కృష్ణానందుల చిత్రం ముద్రించబడిన ప్లాస్టిక్ బిళ్లలు ధరించేరు వాలంటీర్లుగా పనిచేస్తున్న యువకులు ఉత్సాహంగా పనిచేస్తున్నారు

"వరుసలో రండమ్మా!"

"నిన్నే లైనులోరా" జనాన్ని అదుపు చేస్తున్నారు

మీనాక్షి వరుసలో చేరిన దగ్గరనుంచి ఆ కుర్రాణ్ణి చూస్తోంది ఇరవైనాలుగేళ్ళుండవచ్చు మహా అయితే తనకంటే ఏడాదో రెండో ఎక్కువ కావచ్చు తెల్లగా వున్నాడు హిప్పీక్రాపు భుజాలమీద పడుతోంది ఫేస్‌పౌడరో, విభూదో కాని నుదుటిమీద తీర్చిదిద్దుకున్నాడు

జనాన్ని అదుపు చేస్తూనే మీనాక్షిని రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు మీనాక్షి తలొంచుకుంది అతన్ని అంతకుముందా ఊళ్ళో చూసిన గుర్తు లేదామెకు






యువకులు ఎంత అవకాశ వాదులో ఆమెకు గ్రంధాలయం కుర్రాడి ద్వారా తెలిసొచ్చింది

ఆ రోజు తనిలాగే దేవాలయానికొచ్చింది గ్రంధాలయం కుర్రాడు పెళ్ళాన్ని, ఇద్దరి పిల్లల్ని తీసుకుని గుడికొచ్చేడు ఆశ్చర్యపోయిందామె అతనికి పెళ్ళయి ఉంటుందని ఆమె ఊహించలేదు

అది జరిగిన నాలుగు రోజులుకే ఎవరులేని సమయం చూసి తన వాంఛని బయట పెట్టేడా కుర్రాడు ఆమె శరీరంమీద తనకున్న మక్కువ చెప్పి వేడుకున్నాడు క్షుద్ర కామ జ్వర పీడితుడైన ఆ వివాహిత పశువుని చూసి నవ్వాలో, ఏడవాలో మీనాక్షి కర్థంకాలేదు

ఆమె చదివిన నవలల్లో ప్రతినాయకులు వేరు లోకమంతా అక్కడ పచ్చదనమే ప్రేమ కోసం ప్రాణాలివ్వగల ధీరోదాత్తులు ప్రేమికురాలి సుఖం కోసం తన జీవితాన్ని త్యాగం చేసి బరువుగా నడిచి వెళ్ళిపోయే ఉపనాయకులు ఏళ్ళే ఆమె ఊహిస్తున్న ప్రేమనాయకులు

అయితే తన అంచనాలు ఎలా తప్పేయో ఆమెకు అర్థం అయింది తను చూస్తున్న నవలా లోకం చాలా ఇరుకైనదని, దాని వెనుకున్న ప్రపంచం చాలా విశాలమైనదని, దాంట్లో రాగద్వేషాలు, మోసం, దగా ఎన్నో ఉన్నాయని, ప్రేమంటూ ఉన్నా అది అంత విస్తృత వటవృక్షం కాదని గ్రహించింది

ఆ కుర్రాణ్ణి విదలించిపారేసింది పిచ్చివేషి లేస్తే తన అన్నలతో చెప్పి ఒళ్ళు హూనం చేయిస్తానని కళ్ళెర్రచేసింది

"అరే! ఏమిటలా తోసుకుంటారు ఎందుకలా తోసుకుంటారు అరే ఆమెమీద పడతారేంటి" జనాన్ని చేతులతో అదిమిపెట్టేడా యువకుడు తర్వాత మీనాక్షి భుజంమీద చేయివేసి "మీరిలా పక్కకు రండి" అన్నాడు

మీనాక్షి ఒళ్ళు ఝల్లుమంది భుజంమీద అతని చేయి బిగుసుకుంటోంది

"మీరిలా పక్కకు రండి దర్శనానికి నేను తీసికెళ్తాను దర్శనం అయిన తర్వాత వేదిక దగ్గరకు తీసికెళ్ళి కూర్చోపెడతా"

## ధర్మో రక్షతి రక్షితః

మీనాక్షి భుజంమీద చేతిని తప్పించబోయింది అతను గట్టిగా పట్టుకుని "పక్కకు వచ్చేయండి జనం తోసేస్తారు" అంటున్నాడు

ఇంతలో అంతపనీ జరిగింది అవధూత కృష్ణానందులువారు కాషాయరంగు కారులో వచ్చి గుమ్మం ముందు ఆగేరు భక్తులలో సంచలనం ఆరంభ మయింది కారు తలుపు తెరుచుకుంది ఆయన కారు దిగేరు

ప్రజావాహిని కృష్ణానందుల పాదపద్మాల్ని తాకి తరించడానికి ముందుకురికేరు ఈ కబురు లోపలికి చేరింది కాబోలు గుళ్లో ఉన్నవాళ్ళు వెల్లువలా బయటకొచ్చేరు

అదే సమయానికి అవధూతలు, శిష్యబృందం, భక్తులు గుళ్లోకెళ్ళటానికి ప్రయత్నం

రెండు జనప్రవాహాలు ఒకదాన్ని ఒకటి ఒరుసుకున్నాయి

"ఇలా వచ్చేయండి" మీనాక్షి సమాధానం కోసం చూడకుండానే యువకుడు మీనాక్షిని పట్టుకుని తనవైపు లాగేడు

"అయ్యా! వారు గుడిలోకొస్తారు వారికి దారి ఇవ్వండి అమ్మా! పక్కకు తప్పుకోండి" వాలంటీర్లు గొంతు చించుకుంటున్నారు

అయినా, జనం త్రోసుకుంటూ అవధూతల పాదాల్నితాకి పాదాభివందనం చేస్తున్నారు

ఆమెను పట్టుకుని జనం నలిపివేయకుండా ఆపుతున్నాడతను అతని స్పర్శ ఆమెకు తేళ్ళు ప్రాకుతున్నట్లుగా ఉంది

జనం ఒకరినొకరు తోసుకుంటున్నారు ఎవరూ తప్పుకోవటంలేదు

"శివోహం "

ఉరుము ఉరిమినట్లు వినపడింది

"శివోహం "

ముందుకంటే ఉచ్ఛస్వరంలో జనసందోహం మధ్యనించి వెలువడింది

ఆ కంఠంలో ఉండే ఆజ్ఞాధోరణికి ఒక్క నిమిషం జనం కదలలేదు

"శివోహం"

వేయి ఉరుములు ఒకేసారి ఉరిమేయి

మంత్రముగ్ధులయినట్లు జనం నిశబ్దంగా పక్కకు తప్పుకుని దారిచ్చేరు సూది నేలమీద పడితే వినపడేంత నిశ్శబ్దం

తిన్నగా ధ్వజస్తంబం వరకు ఒకే బాట ఎవరూ ముందు లేరు

అంతటి జనసమూహాన్ని తన 'శివోహం' అనే నాదంతో అదుపు చేసినవారెవరో మీనాక్షి కర్థం కాలేదు పాదాలు పైకెత్తి వేళ్ళమీద నిలబడి చూసింది

గౌతమశాస్త్రి కాషాయి రంగు దుస్తుల్లో ఉన్నాడు 'శివోహం' అంటూ ముందు నడుస్తున్నాడు కృష్ణానందులు అనుసరిస్తున్నారు

"శివోహం " ఎవరో ప్రతిధ్వనించేరు

"శివోహం" గర్జించేడు గౌతమశాస్త్రి

జనం వాగ్బంధం అయినట్లు మౌనులయ్యేరు అంతా క్రమబద్ధంగా ఆలయంలోకి నడిచేరు

మీనాక్షి రెప్పవేయకుండా గౌతమ్ని చూస్తోంది మూడేళ్ళ తర్వావాత కనబడ్డాడు ఇంతకాలం ఎక్కడున్నాడు? కృష్ణానందులు ఆశ్రమంలోనే ఉంటున్నాడా? సన్యాసం స్వీకరించేడా? లేక వలంటీరుగా ఉంటున్నాడా? వెళ్ళి పలుకరిస్తే బాగుంటుందా? బాగుండదా? ఇంతటి జనాన్ని ఆదుపు చేయగలిగే వాక్శుద్ధి ఎలా అలవడింది?

మీనాక్షి ఆలోచనలు చెదరగొడుతూ భుజం మీద చేయి బిగుసుకుంటోంది

"వదులూ " హెచ్చరికగా అంది

యువకుడు భుజంమీద చెయ్యి తీసేశాడు

మీనాక్షి భుజంమీంచి పమిట తిప్పి వేసుకుని గుళ్ళోకి నడిచింది

అప్పటికే చాలా మంది జనం వేదిక దగ్గరకు చేరారు తమ్ముడికేసి చూస్తూ దూరంగా చతికిల పడింది మీనాక్షి

(ఇంకా వుంది)






# చిన్నమనసు

## కొరుకొండ సత్యానంద్




"ఛీ... ఛీ! వెధవ కొంప, వెధవ మనుష్యులు"

రుసరుసలాడుతూ వీధిలోకి వచ్చి చెప్పులు తొడుక్కొని బయటికి వెళ్ళిపోయాడు జగదీష్.

అలా కోపంగా వెళ్ళిపోతున్న భర్త వైపు అచేతనంగా చూస్తూ ఉండిపోయింది శాంతి.

ఆమెకూ కోపం వస్తుంది. ఆమెకూ చిరాకుగా ఉంది. కానీ, ఆడదానిగా ఏమీ చేయలేకపోయింది.

అతని కంత కోపం రావడానికి కారణం శాంతి కోరిన కోరిక. జీవితాన్ని పంచుకున్న భార్య, సర్వం భర్తే అని అనుకునే భార్య ఆ మాత్రం కోరిక కోరకూడదా!?

అసలు తనేం కోరింది?

పండగ కదా అని ఒక చీర కొనమని ముందే చెప్పింది. ఆర్థికమైన ఇబ్బందుల వల్ల కొనలేక పోయానని చెప్తే తను మాత్రం ఊరుకోదా? తను మాత్రం అర్థం చేసుకోలేదా!?

అంత మాత్రానికి అంతలా విసవిసలాడిపోవాలా!?

పండగనాడు దేవుడి దగ్గర పెట్టడానికి ఓ క్రొత్తబట్టైనా లేదు అని అంది. ఆడదానిగా కాస్త ఎక్కువే అంది. అందుకని, అంతదానికే 'కయ్'మని లేచిపోవాలా? అంతలోనే అంతలా విసుక్కొని అలా బయటకు వెళ్ళిపోవాలా?

ఈ మగవాళ్ళ బుద్ధే అంత!

భార్య ఏది అన్నా, తమ చాతగాని తనాన్ని ఎత్తి చూపిస్తుందనే భావనే కలుగుతుంది వాళ్ళకు! భార్య కోరిన సామాన్యమైన కోరికను జల్సా, దుబారా, ఆలోచించడం రానితనం అని అనుకుంటారు.

అలా అలా ఏవేవో అనుకుంటూ కూర్చుంది శాంతి.

కొంత సేపయ్యేసరికి ఆ ఉడుకుమోత్తనం తగ్గుముఖం పట్టింది.

ఆమె ఆలోచనలు భర్త మంచితనం వైపుకు మొగ్గాయి.

అతను అలాంటి వారా? పెళ్ళైన క్రొత్తలో ఎంత బాగా చూసుకొనేవారు? ఇప్పుడు మాత్రం? ప్రతి సంగతినీ, ప్రతి కుటుంబ విషయాన్నీ తనతో చర్చించి, తన సలహాతోనే ఏ పనైనా చేస్తారు. వచ్చే జీతం చాలక, ఒక ప్రక్క పెరిగిపోతున్న ధరల్ని తట్టుకుంటూ, ఇంట్లో ఖర్చులకు, పిల్లల కాన్వెంటు చదువులకు కష్టమైనా, వాళ్ళ ఫీజుల్ని కడుతూ జాగ్రత్తగా సంసారాన్నీదుకొస్తున్నారు. నా వాళ్ళు, అతనివాళ్ళు వచ్చి ఎన్నిరోజులున్నా, ఎంత తిన్నా విసుక్కోకుండా గుట్టుగా అన్నింటినీ సరిపెట్టుకొస్తున్నారు.

కానీ, తనే! తొందరపడి చీర గురించి గుచ్చి గుచ్చి అడిగింది. అతనెంత బాధపడకపోతే అలా బయటికి వెళ్ళిపోతారు?

ఇంట్లో ఆడదాని ప్రవర్తన మగవాడిమీద ఎంత ప్రభావాన్ని చూపిస్తుందో!?

తను కూడా ఉద్యోగం చేసి వేణ్ణీళ్ళకు చన్నీళ్ళు తోడుగా ఉందామంటే తను పదో తరగతితోనే చదువుకు స్వస్తి చెప్పేసింది.

అలా అన్నింటినీ తనలో తనే ఆలోచించు

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥

## చిన్న మనసు

కొని బాధపడుతుంది గత జలసేతు బంధనం అని అనుకొని సిగ్గుపడింది శాంతి

అసలు వీటన్నింటికీ కారణం ఎవరు ?

ఆ రంగమ్మ కాదూ!? అదే నిన్న అలా అని ఉండకపోతే, తనలో ఆ భావం కలిగి ఉండేదా?

అది ఎంత గొప్పగా చెప్పుకుంది???

రంగమ్మ శాంతి వాళ్ళింట్లో పనిమనిషి పిల్లల్తో శాంతి చేసుకోలేదని, శాంతి వద్దన్నా జగదీషే ఆమెను కుదిర్చాడు రంగమ్మ శాంతి కంటె రెండు మూడేళ్ళు చిన్నదే అయి ఉంటుంది ఒక కొడుకు కూడా ఉన్నాడు ఆమెకు

రంగమ్మ పనిమనిషే అయినా ఒక ఆడదే!

శాంతి రంగమ్మకు యజమానురాలే అయినా ఆమె కూడా ఆడదే!

అందుకే ఈ గొడవ! అందుకే ఈ కథ!!

శాంతి లాంటి మధ్యతరగతి ఆడదాని మనసు ఆకాశానికి, భూమికి మధ్య అస్తవ్యస్తంగా ఊయల లూగుతుంది ఆమె ఆశలు ఆకాశాన్నందుకోలేక, భూమిమీదే పడి ఉండలేక భూమ్యాకాశాల మధ్య ఊగిసలాడుతుంటాయి ఎప్పుడూ ఆమె సతమౌతూ ఉంటుంది సంస్కారం ఉన్నా, ఆలోచనలు ఎన్ని ఉన్నా అప్పుడప్పుడూ అవి బండబారిపోయి మొండిగా తయారౌతాయి వింతగా ప్రవర్తిస్తాయి అనుకోని పరిణామాలకు కారణాలౌతుంటాయి

ఆ ఒక్క లోపమే లేకపోతే ఆమె ఎంత సంపూర్ణ గృహిణి!?

రంగమ్మ గుర్తుకు వచ్చి శాంతి మరలా చిరాకు పడిపోయింది నిన్న తనకు, రంగమ్మకు మధ్య జరిగిన సంభాషణ గుర్తుకు వచ్చింది

"అమ్మగోరూ! పెతీ యేడూ పండక్కి మీరే పెట్టేవోరు ఏదో పాత చీర "

"అవునే! ఇప్పుడేమంటావ్ ఈ యేడు కూడా పెడతాన్లేవే!"

"అమ్మగోరూ! మీకీ యేడు ఎన్ని చీరలు కొన్నారండి?" అని అడిగింది రంగమ్మ

ఆ ప్రశ్నకు సమాధానం ఎలా చెప్పాలో అర్థం కాలేదు శాంతికి

ప్రతి సంవత్సరం రెండు మూడు చీరలు కొన్నారని గొప్పగా, దర్జాగా చెప్పేది కానీ, ఈసారి ఒక చీర కూడా కొనలేదని ఎలా చెప్పాలి? జగదీష్ కొనలేదని చెప్పాలా? కొనలేరని చెప్పాలా? కొంటారని చెప్పాలా? ఏం చెప్పాలి ?

ఆమె మదిలో అనేక ప్రశ్నలు మొలకెత్తాయి ఆలోచించుకొని చెప్పింది శాంతి

" ఇంకా కొనలేదు కొంటారట "

రంగమ్మ సంతోషంగా ముఖం పెట్టి "అమ్మగోరూ! ఇయ్యేడు ఏ అమ్మోరు మా మావ మీద పూనిందో గానీ, కొత్తచీర కొనుక్కోమని ముప్పై రూపాయిలిచ్చేడు సాయంకాలం సంత కెల్లి కొందాం అని కూడా అన్నాడు " అంది.

ఆ మాటకే 'శాంతి' అనే ఆడ హృదయంలో అసూయ చెలరేగింది

ఎన్నడూ కొన(లే)ని భర్త ముచ్చటగా పండక్కి ఓ చీర కొంటున్నాడని ఆడదానిగా మురిసిపోతూ చెప్పింది రంగమ్మ

తనింట్లో మిగిలిపోయిన మెతుకుల్ని ఆశగా పట్టుకొనిపోయి పూటగడుపుకునే నిమ్న స్థితిలో ఉన్న రంగమ్మ తనని ఎగతాళి చేస్తుందేమోనని అనుమానంగా, అసూయగా ఆలోచించటం మొదలు పెట్టింది శాంతి

దీనికెంత గర్వం? ప్రతీ సంవత్సరం తను విప్పి పారేసిన చీర సింగారించుకొని తిరిగేది ఈ యేడు ఎలాగో దానిమొగుడు కొంటున్నాడని మురిసిపోయింది

ఆ చీరైనా ఎంత? ముప్పై రూపాయల చీర! ఉలికితే గజంన్నర ముడుచుకుపోయే చీరకే అందంత మురిసిపోతోంది హుఁ చిన్నబతుకులు చిన్న మనసులు మాటలు మాత్రం మహాపెద్దవి

కానీ —అది ఆ చీర కట్టుకునే, రేపువస్తుంది చాలాసార్లు కట్టుకున్న చీరనే నేను రేపుకూడా కట్టుకోవడం చూసిందంటే అదెంతలా గర్వపడిపోతుంది ? మరింతగా నా దగ్గర పోజ కొట్టేయ్యదూ!?

అది నేను భరించగలనా!?

ఆఁ నాది పాతచీరే అయినా, దాని చీరకంటే ఖరీదైన చీరేకదా!? అయితే మాత్రం ఏదైనా, ఏమైనా, క్రొత్తచీర క్రొత్తదే పాతచీర పాతదే!

అది ఆ క్రొత్తచీర కట్టుకుని నా దగ్గరకొచ్చి, గొప్పగా చెప్పుకుని మురిసిపోతుంది మాట్లాడుతూ మీకు కొత్తచీర లేదా? అన్నట్టుగా చూస్తుంది

ఆ సంఘటన గుర్తొస్తుంటే ఇప్పుడే శాంతికి ఒళ్ళు చచ్చిపోయినట్లుగా అయిపోతుంది

అందుకే ఇందాక జగదీష్‌తో పోట్లాటల్లా మాట్లాడింది శాంతి జగదీష్ ఇక ఇంట్లో ఉండలేక బయటికి వెళ్ళిపోయాడు

ఉదయం కూడా ఒకసారి భర్తతో చిన్న పోట్లాట పెట్టుకుంది అప్పుడు రంగమ్మ మినపప్పు రుబ్బుతోంది దానికి వినబడితే బాగుండదని అంత గట్టిగా అనలేదు తర్వాత రంగమ్మ వెళ్ళిపోయాక, వంట పూర్తైపోయాక భర్త గదిలో పడుకొని ఉంటే, వండిన గారెలు రెండు శాంపిల్‌గా పెట్టి మొదలుపెట్టింది దాంతో ఆ గారెలు పూర్తిగా తినకుండానే బయటికి వెళ్ళిపోయాడు జగదీష్

నిన్నరాత్రంతా శాంతి ఆ చీర గురించే ఆలోచించిందిగానీ, భర్తను అడగలేకపోయింది

ఉదయాన్నే రంగమ్మ వచ్చి పని చేస్తున్నప్పుడు 'మీ ఆయన చీర కొన్నాడా రంగమ్మా?' అని అడగాలనుకుంది శాంతి

కానీ, అలా అడిగితే, ఒకవేళ నిజంగా వాడు కొంటే, ఆ చీర గురించి, దాని మొగుడి గురించి ఎక్కడ గొప్పలు చెప్తుందోననుకొని ఏమీ అడగలేదు శాంతి

అప్పుడే ఆ ఆలోచనల్లో ఉన్నప్పుడే ఎదురైన భర్తతో చిన్నగా తగాదా పెట్టుకుంది జగదీష్, ఏదో సమాధానం చెప్పి ఊరుకున్నాడు

గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

శాంతి తన గజిబిజి ఆలోచనల్లోంచి ఈ లోకంలోకి వచ్చింది

''అమ్మా! ఆకలేస్తుంది అన్నం పెట్టవే'' పిల్లలు శాంతిని అడిగారు

వంట గదిలో పీటలు వేసి పిల్లలకి అన్నీపెట్టి గదిలోకి వెళ్ళి మంచంమీద జారగిలబడింది

''ఈయన భోజనానికి వస్తారో రారో'' అని దిగాలు పడింది

తను చేసిందానికి తనే బాధపడింది

అప్పుడప్పుడూ, చిన్న చిన్న తగాదాలైనప్పుడు జగదీష్ ఇక ఆ పూట భోజనానికి రాడు ఒకవేళ వచ్చినా భోజనం చేయడు ఆ అలక మరుపూటతో సరి ! మామూలుగానే, భార్యతో సరదాగా, సరసాలాడుతూ, నవ్వుతూ, నవ్విస్తూ ఉంటాడు

పండగ పూట భర్తను భోజనం మానేసేలా చేసినందుకు లోలోపలే దుఃఖపడింది శాంతి

కళ్ళల్లో సన్నని కన్నీటిపొర ఏర్పడింది

అలాగే ఓ గంట గడిచిపోయింది పిల్లలు ప్రక్క గదిలో పడుకుండిపోయారు

గడియారం ఒక గంట కొట్టింది

ఉదయం — తడిచేతులు చీరకొంగుతో తుడుచుకుంటూ వచ్చి ''అమ్మగోరూ ! పప్పు రుబ్బేసేనండి ఉప్పు కూడా కలిపేసేనండి సరిపోనాదో, లేదో చూసుకోండి'' అంది

అప్పుడే భర్తతో చిన్నగా తగాదా అవ్వడంతో శాంతి ఏమీ మాట్లాడలేదు రంగమ్మతో

''అమ్మగోరూ ! ఇయ్యాల పండక్కదండీ ఇంట్లో పొయ్యి ఎయ్యాల పిల్లోడికి నీల్లొయ్యాల మా మావఁ కూడా ఇంటికాడే ఉన్నాడు మిగిలిన ఇళ్ళు కూడా సూసుకొని మల్లా మద్దాన్నం వత్తానండి ఇప్పుడు నేనెల్లిపోనా అమ్మగోరూ ! ?'' అని అడిగింది రంగమ్మ

శాంతి ముఖం చిట్లించుకుంటూ 'సరే వెళ్ళు!' అని అంది

ఆ సంఘటన గుర్తొచ్చింది శాంతికి

అంటే అది ఇప్పుడు వస్తుందా ? క్రొత్త చీర సింగారించుకుని, నాకు చూపెట్టి గొప్పలు పోవడానికి వస్తుందా ? వచ్చి ప్రతి యేడులా నేనిచ్చేదాన్ని పట్టుకుపోతుందా ?

ఈ సారి దానికి ఏమీ ఇవ్వకూడదు పిల్లలు అన్నీ తినేశారు రంగమ్మా ! ఏమీ అనుకోకు అని చెప్పేయాలి లేకపోతే, ఈ రెండ్రోజులూ మామూలుగానే ఉండి, నా ఇంటిపని నేను చేసుకోగలనులే అనిచెప్పి పని మానిపించేయాలి

ఇలా రకరకాలుగా శాంతిలో ఆలోచనలు చెలరేగుతున్నాయి

అంతలో

వీధి తలుపును ఎవరో తట్టినశబ్దం విన్పించింది

'' అదిగో వచ్చేసినట్టుంది రాణి చవక రకం ఎరుపు చీరో, కాషాయవర్ణం చీరోకట్టుకొని పెద్ద హైక్లాస్ చీరలా ఫీలైపోతూ ఉంటుంది అయినా, అమ్మగోరూ ! అని ఊరికే సాగదీసుకుని కేకలేసేది అసలు పిలవడం లేదేం ? నాజూకుమీద దూరేకుతున్నట్లుంది ''అని అనుకుంటూగదిలోంచి వచ్చి తలుపు తీసింది, ముఖం చిట్లిస్తూ శాంతి

చిరాకుగా తలుపు తీసిన వెంటనే తన చూపుల నుండి తప్పించుకుంటూ లోపలకు వచ్చేసిన భర్తను చూసేసరికి ఎందుకో శాంతి గుండె గుభేలుమంది

జగదీష్ నేరుగా మధ్య గదిలోకి వెళ్ళి మంచం మీద వాలిపోయాడు

శాంతికూడా వెనుక గబగబా వెళ్ళింది ఆ గదిలోకి

''ఏవండీ ! ఎక్కడికెళ్ళారండి ?''

''   ''

''ఒంటిగంట దాటిపోయింది భోజనానికి లేవండి ''

''   ''

''నేనుకూడా భోజనం చేయలేదు ''

'' అయితే నువ్వు చేసెయ్ !''

''మరి మీరు !''

''రామారావు వాళ్ళింటికెళ్తే వాడు అన్నీ పెట్టేడు ''

''అయితే మాత్రం ? వాటితోనే కడుపు నిండి పోతుందా ? రండి, కొద్దిగా తినండి ''

''వద్దు వాడి సంసారాన్ని చూసాక కడుపు నిండిపోయినట్లయ్యింది ''

ఇంతవరకూ భర్త మరీ ముక్తసరిగా మాట్లాడినా ఆగగలిగిందిగానీ, చివరగా అన్న ఆ మాటను భరించలేకపోయింది శాంతి

అప్రయత్నంగానే ఏడుపు వచ్చేసింది ఆమెకు

జగదీష్ గోడవైపుకు తిరిగిపోయాడు అసహనంగా నిట్టూరుస్తూ

ఆ చర్యకు అదోలా అయిపోయింది శాంతి మనసు

ఇక అక్కడ ఉండలేక బరువెక్కిన గుండెతో బరువుగా నడుచుకుంటూ వరండాలోకి వచ్చి వీధి తలుపు వేసేసి కుర్చీలో కూర్చుంది

దుఃఖంతో గొంతుకు పూడుకుపోయినట్లయ్యింది బరువెక్కిన గుండెతో నీరసంగా ఉన్నట్లుంది

భర్త గురించి, తన గురించి రకరకాలుగా, అనేక కోణాల్నుంచి ఆలోచించడం మొదలుపెట్టింది

అది ఆమెకు అలవాటు ఏ చిన్న గొడవ జరిగినా, మరీ బాధపడిపోయి, అన్నీ ఆలోచించేసి, కొంతసేపటికి మామూలుగా తయారైపోతుంది జగదీష్ కూడా అంతే ఎంత సీరియస్‌గా ఉన్నా ఆ పూటగానీ, ఆ రోజుగానీ దాటిపోయాక మామూలుగా, సరదాగా ఉంటాడు

ఒక అరగంట గడిచేసరికి ఆలోచనలన్నీ అయిపోయాక గుండె తేలికైనట్లయ్యింది శాంతికి

మెల్లిగా లేచి మధ్య గదిలోకి వెళ్ళింది మంచంమీద జగదీష్ నిద్రపోతున్నాడు లేపితే కసురుతాడనుకొని మరలా వరండాలోకి వచ్చి కుర్చీలో కూర్చోబోయేంతలో

'' అమ్మగోరూ ! అమ్మగోరూ ! శాంతమ్మగోరూ !'' అన్న పిలుపులు విన్పించి కూర్చోనే ప్రయత్నంమానుకొని అలాగేనిల్చుండిపోయింది శాంతి

'' ఆఁ వచ్చేసింది రంగసాని 'అన్న టైముకు టంచనుగా వచ్చేసింది సెలక్షన్, మాచింగ్ రాకపోయినా, ఎగుడు దిగుడు కుచ్చెళ్ళను సర్దుకోవాలన్న సంగతి తెలియకపోయినా అమ్మవారిలా తయారైపోయి ఉంటుంది దీని బుద్ధిని తగలెయ్య ఏవేవో ఇంగితజ్ఞానం కోల్పోయినదానిలా తిట్టుకుంది శాంతి రంగమ్మను

రంగమ్మ మళ్ళా పిలిచింది ''శాంతమ్మగోరూ !'' అంటూ

శాంతి అడుగులు ముందుకు పడ్డాయి అప్రయత్నంగా ఆమె కళ్ళకు ఏదో ముదురు రంగు, పెద్ద పెద్ద పువ్వులున్న డిజైన్ గల చవకబారు చీరతో ఉన్న రంగమ్మ కన్పిస్తుంది అది నవ్వుతున్నట్లుగా . ఆ నవ్వులో బోలెడంత గర్వం ఉన్నట్లుగా ఊహిస్తుంది శాంతి






రంగమ్మ కొనుక్కునే చీర రంగు ఆమెకు నచ్చదు ఆ పూల డిజైన్ కూడా ఆమెకు నచ్చదు కానీ ఎందుకో శాంతిలో వింత అసంతృప్తి అసూయ, వెదువాసన తనకు లేని 'క్రొత్త చీర' అనేది రంగమ్మ ఉరఫ్ తన ఇంట్లో పాచిపని చేసుకొనే పని మనిషికి ఉంది అదొక్కటే ఆమె వింత ఆలోచనలకు కారణం

గడియతీసి తలుపులు తెరచింది శాంతి.

ఎదురుగా రంగమ్మ

ఆమెను చూసిన శాంతి ఆలోచనలు పటాపంచలైపోయాయి అంతవరకూ ఉన్న అహం, అసూయాలు ఒక్కసారిగా మాయమైపోయాయి తనకు తెలియకుండానే మనసు కొద్ది బాధతో మూలిగింది కొద్ది జాలికూడా కలిగింది ఎందుకో రంగమ్మమీద

కారణం రంగమ్మ క్రొత్తచీర కట్టుకొని రాలేదు

అగ్నిలా రాజుకున్న శాంతి హృదయం మీదికి ఆజ్యంలా రాలేదు

చన్నీటి జల్లులా వచ్చింది

శాంతి రెండేళ్ళ క్రిందట ఇదే పండక్కి ఇచ్చిన గళ్ళ ఆఫ్ వాయిల్ చీర కట్టుకొని వచ్చింది రంగమ్మ ఆ చీరకు అక్కడక్కడా చిరుగులు, కుట్లు ఉన్నాయి ఎర్రని జాకెట్టు భుజం దగ్గర కుట్టు కొద్దిగా ఊడినట్లు కన్పిస్తోంది

అందుకే శాంతి హృదయంలోని అసూయ, ఆందోళనలు నిమ్మళించాయి ఆమె మనసు ఏదో కొద్ది బాధతో మూలిగింది

"అమ్మగోరూ! పండక్కి నా వాటా నా కిచ్చేయండి బూర్లు, గార్లు ఇంకా ఏమైనా" అంది హుషారుగా లోపలకు వస్తూ

శాంతి హృదయం ఎందుకో కుదుటపడి నట్లయ్యింది

ఆందోళన సముద్రం అంతా ఆవిరైపోయి ఒక చిన్న అనుమానపు మబ్బు మాత్రం మిగిలిపోయింది

పెరట్లో ఉన్న చీపురును తెస్తూ వరండా తుడవడం మొదలుపెట్టింది రంగమ్మ

మిగిలి ఉన్న అనుమానాన్ని అడిగి తీర్చుకోవా



లనుకుందిగానీ, ఆమె పెదవులు విడివడలేదు

వరండా తుడుస్తూ ఏదో చెప్పడం మొదలు పెట్టింది రంగమ్మ

"ఏటో అమ్మగోరూ! ఒక పండగలేదు, పబ్బం లేదు మా మావ మాటకి నిలకడలేదు అయిదు సీసాలు తెచ్చీసుకొని న్రాత్రి నుండి అదే తాగడం అమ్మగోరూ! మావా! చీర కొనుక్కుదాం రారా!! అని అడిగితే ఏటన్నాడో తెలుసునా అమ్మగోరూ!?"

ఆత్రుత లోపల్నుండి తన్నుకు వస్తున్నా పైకి ఎంత జాగ్రత్త పడుతూ "ఏమిటన్నాడు?" అన్నట్లుగా రంగమ్మ వైపు చూసింది శాంతి

"ఇంకేటంటాడో మీకు తెలిదేటి అమ్మగోరూ? మా మావే కాదు, ఏ తాగుబోతు ఎదవన్నా అలాగే అంటాడు."

ఆత్రుతను ఆపుకోలేక "ఇంతకీ ఏమిటన్నాడే?" చిన్నగా తెచ్చిపెట్టుకున్న నవ్వు నవ్వుతూ అందిశాంతి

"ఏటంటాడండి? రేపు పండగనాడు నాకు మందు ముందా? నీ చీర ముందా? అందుకే ఆ డబ్బెట్టి ఈ సీసాలు తెచ్చీసేనే! అని తాగుబోతు నవ్వు నవ్వీసేడండి ఇంకేటంటానండి ఆడి సరదా కంటే నా చీర ముక్కవేటండీ? తాగి పాడైపోతాడని బెంగే గానండి, చీర తేలేదని నాకే కోపం లేదండి ఆడిమీద అయినా అమ్మగోరూ! డబ్బులుండాలిగానీ, ఏ మొగుడు పెళ్లానికి చీర తెచ్చిపెట్టి చుట్టపెడదామనుకోడండి?" అని ఇంకా ఏవేవో చెప్తోంది రంగమ్మ

దాని మాటలకు శాంతి మదిలో ముసురుకున్న మబ్బులు మటుమాయమౌతున్నాయి ఆమెకు రంగమ్మ భాషలో, మాటల్లో, దాని ముఖంలో ఎన్నో నిజాలు దాగి ఉన్నాయేమో నన్పించింది

రంగమ్మ ఇంకా ఏదో మాట్లాడుతూ వరండాలో ఒక మూల చీపురును పెట్టి శాంతి వైపు చూసింది

శాంతి ముఖంలో భావాలు చూసి రంగమ్మ చిన్నగా నవ్వుతూ "అమ్మగోరూ! ఏటండీ ఆలోసిత్తన్నారు? తోమడానికి ఏమైనా ఉంటే పడేయండి తోమేత్తాను" అంది

శాంతి రంగమ్మ వైపు చూస్తూ "ఇవ్వాళేం పని చేస్తావుగానీ, రేపు చేద్దువులే! ఉండు వస్తాను" అని లోపలకు వెళ్ళి ఒక రెండు నిముషాల్లో మరలా బయటకు వచ్చింది చేతిలో పళ్ళెంతో

ఆ పళ్ళెంలో గారెలు, బూరెలు, అరటిపళ్ళు, కొబ్బరిచెక్క, ఆకులు, వక్కలు, ఒక పాత చీర, రెండు రూపాయల నోటు ఉన్నాయి

"ఇదిగో రంగమ్మా నీ పండగ మామూలు" అని రంగమ్మకు పళ్ళెం అందించింది

రంగమ్మ ముఖాన్నింత చేసుకొని "అమ్మగోరూ!" అని శాంతి కాళ్ళకు దణ్ణం పెట్టింది

"ఇదేంటే? నాకు దణ్ణం పెడతావేంటి, లే! వెళ్ళి నీ మొగుడికి, నీ కొడుక్కి పెట్టు" అంది

రంగమ్మ పళ్ళెంలోని చీర, రెండ్రూపాయల నోటిని చేత్తో పట్టుకొని మిగిలినవాటిని కొంగులో వేసుకొని బయటకు వెళ్ళిపోయింది

వెళ్ళిపోతున్న రంగమ్మవైపు అలాగే చూస్తూ ఉండిపోయింది శాంతి

ఇప్పుడామె మనసు ఆందోళనా రహితంగా, ప్రశాంతంగా, హాయిగా ఉంది

రంగమ్మ వీధి మలుపు తిరిగి వెళ్ళిపోగానే తలుపులు వేసుకొని భర్త ఉన్న గదిలోకి వెళ్ళి పోయింది శాంతి

గుడిసె వైపుకు నడుచుకుంటూ వెళ్తున్న రంగమ్మకు నిన్న ఉదయం శాంతి జగదీష్‌తో అన్న మాటలు గుర్తొచ్చాయి

"నా కన్నా పనిమనిషే నయం! మీ కన్నా దాని మొగుడే నయం! పండగనాడు దానికి ఓ క్రొత్త చీరైనా ఉంది దాని యజమానినైన నాకు అదీ లేదు రేపది క్రొత్తచీర కట్టుకొని వచ్చి నా దగ్గిర లింగు లింగు మంటూ తిరిగితే ఎప్పుడూ కట్టుకునే పాతచీరతో దానిదగ్గిర నేనెలాతిరిగేదండీ?"

ఆ మాటలు గుర్తొచ్చి రంగమ్మ తనలో తనే అస్పష్టంగా ఏదో గొణుక్కుంది

"పోనీలే, అమ్మగోరు సంతోషంగా ఉన్నారు. నిన్న పప్పురుబ్బి ఉప్పుకోసం వంట గదిలోకి వచ్చేటప్పుడు అమ్మగోరి మాటలు నేను ఇనకపోతే ఇయ్యాల, పండగ పూటా, అమ్మగోరి మనసు పాడుసేసిందాన్నే. పోదును పెద్ద గొప్పగా నిన్న సాయంత్రం మావ కొన్న ఎర్రచీర ఇయ్యాల కట్టుకొనొత్తే పాపం అమ్మగోరు ఎంత బాధపడి పోయుండేవోరు? ఛ! ఇయ్యాలన్నీ ఇలాగ ఆలోసిత్తన్నానేటి? అమ్మగోరేటి? నా చీరను సూసి బాధపడ్డం ఏటి? ఏదో అలా అన్నారేమోగానీ, నిజంగా నా మీద కోపం ఉంటే గార్లు, బూర్లు, డబ్బులు, చీర అన్నీ ఇత్తారా ఏటి? నాది చిన్న మనసు కాబట్టే ఇలా ఆలోచిత్తంది. ఎంతైనా అమ్మగోరిది పెద్ద చెయ్యి, పెద్ద మనసు."

అలా ఏవేవో అనుకుంటూ గుడిసె చేరుకుంది రంగమ్మ ★

విశాఖపట్నం ఆంధ్రాబ్యాంక్ ఎంప్లాయీస్ రిక్రియేషన్ క్లబ్‌వారు తమ స్వాతంత్ర్య దినోత్సవ కార్యక్రమాలలో భాగంగా ప్రముఖ రచయిత, సినీ నటుడు శ్రీ గొల్లపూడి మారుతీరావు అభినందనసభ జరిపారు. వేదికపై ఉన్న శ్రీయుతులు చాట్ల శ్రీరాములు, డి బాలకృష్ణ, ఇ. శివశంకరం, గొల్లపూడి మారుతీరావు, డా. కె విశ్వనాథరావులని చిత్రంలో చూడవచ్చు




**ఎస్ ఎల్. బి-ఎస్ — తుని**

కొన్ని నవలలలో మీరు కోటనందూరు అని వ్రాసారు. కోటనందూరుకి మీకు వున్న అనుబంధం ఏమిటి?

కోటనందూరు మా తాతగారి వూరు. తునీ మా తాతగారి వూరే. మా మాతామహులు కాశీ నడిచి వెళ్లొచ్చిన ఘనులు. పితామహులు తునికి ఆఖరు దివాను—గురజాడ వారికి సమకాలికులు కూడా కాబోలు. అయినా చిన్నతనంలో చూసిన వూళ్ళు. వయస్సు మళ్లిపోతూ వుంటే చాలా ఆత్మీయంగా కనబడుతాయి కాబోలు— లేకపోతే ఎప్పటి కోటనందూరు? ఎప్పటి నేను?!

**పి. ఆర్. — రాజమండ్రి**

ఎంత చదివినా ప్రయోజనం లేనప్పుడు ఎంతవరకు చదువుకోవాలి?

డిగ్రీ మీద మోజుంటేనే కాలేజీకి వెళ్లాలి. లేదా— తగిన అర్హతలు రాగానే ఏ వృత్తి విద్యనైనా చేపట్టి జీవితంలో నిలదొక్కుకునే ప్రయత్నాలు చేయాలి. చదువుకుంటూనే వుంటే బెడద వుండదన్న ధోరణితో యీ రోజుల్లో 'పరిశోధన'కి దిగుతున్నారన్న విమర్శలు మీరు చదవ లేదా?!

**ఎమ్. ఎస్ — ఉండి**

నేటి రాజకీయాల గురించి మీ అభిప్రాయం? మనదేశంలో లాగే ఇతర దేశాల్లో కూడా వుంటాయా?

ఇంతకంటే దారుణంగా కూడా వుంటున్నాయి. కనీసం జరుగుతున్నది అన్యాయమని అరిచి చెప్పే హక్కుంది మనకి. అదీ లేని ఎన్నో అభ్యుదయ దేశాలున్నాయి.

**బి. సిహెచ్ కె. — కదిరి**

మా శ్రీవారు ప్రేమ గొప్పదంటారు. నేను పెళ్లి గొప్ప అంటాను. ఏది గొప్ప?

అసలు మీ ఇద్దరికీ రెండూ గొప్ప అయి వుండాలి, భార్యాభర్తలు కనుక. కాని భార్యతోనే ప్రేమ గొప్పదనే వ్యక్తి మీద ఓ కన్నేసి వుంచడం మంచిది— ప్రేమ వేరు పెళ్లి వేరు అనుకుంటున్నారు కనుక.

**పిహెచ్. ఎన్. — నిడదవోలు**

మీరెన్నిసంవత్సరాల నుంచి ప్రశ్నలు యిస్తున్నారు?

బాగా గుర్తు లేదు సోదరీ! అయినా యివి పెద్ద సాహిత్యపు విలువ లుండేవి అని నేను భావించడం లేదు. వారం వారం సరదాగా వూహలు పంచుకోవడంగా మాత్రమే వీటిని చూస్తాన్నేను. అందుకే సేకరించి పెట్టలేదు.

**టి. టి. ఎమ్. ఆర్. — పెదకాకాని**

మీరు హటాత్తుగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయితే ఏం చేస్తారు?

ఇక్కడెందుకు? ఢిల్లీలో వుంటాను—పనులు త్వరగా జరుగుతాయి. ఇక్కడి నుంచి వెళ్తూ వస్తూంటే ఖర్చు ఎక్కువ. ఏమంటారు?!

**కె. ఎస్ — అనంతపురం**

మారే కాలంలో మారని మనుషులున్నారు. ఈ మారని వ్యవస్థలో మన సమాజం ఏమై పోతుందంటారు?

సమాజం ఏమీకాదు. మారుతున్న కాలంలో మారుతున్న మనిషి అవస్థల పాలవుతాడు. అందరూ ఒకసారి మారడం జరగదు కనుక ఈ—బాధ.

**కె. ఎమ్. ఆర్. — గరికపాడు**

సినిమాలో హీరో హీరోయినుల మధ్య వచ్చే వాడిని విలన్ అనే అంటారు కదా. మరి వారిద్దరి మధ్య వచ్చే ఆమెను ఏమంటారు?

పూర్వం వాంప్ అనేవాళ్ళు. ఇప్పుడు ఇంకో హీరోయిన్ వస్తోంది కనక—ఆ వాంప్ పాత్రలు పోయాయి!

**సోదరుడు — అక్కుపల్లి**

వర్ణాంతర వివాహం చేసుకోవాలనే వుంది. నేను ఆమెతో ఎలా మాట్లాడాలో అర్థం కావడం లేదు. .

బాగుంది. ప్రేమ ముందు కులగోత్రాలు చూడదు. అలా చూసి చేసేది సంబంధం. వీటన్నిటినీ ప్రేమ వుంటే అధిగమించడం కష్టంకాదు. కాని ఆ ప్రేమకి నేలూని కాళ్లుండాలి.

**జి. వి. ఆర్. సికింద్రాబాదు**

సుఖజీవన మార్గం ఏది?

తృప్తి. తృప్తిగా బతకగలిగిన వాడికి దుఃఖం దూరంగా వుంటుంది!

**జి. ఎస్. ఆర్. — నేలకొండపల్లి**

కోర్టు హాలులో తరాజు పట్టుకున్న బొమ్మకి కళ్లకు గంతలు కడుతారెందుకు? చాలా సినిమాల్లో చూశాను.

ధర్మదేవతకి చెవులే గాని చూపు అనవసరం. సాక్ష్యాధారాలపై న్యాయాన్యాయాలు నిర్ణయించడమే జరగాలి గాని మనుషులను చూసి కాదన్న దానికి చిహ్నంగానే ఆ గంతలు. (పాపం సినిమా వాళ్లే యింకా ధర్మదేవతని చూపిస్తున్నారు. లేకపోతే అదీ తెలిసే అవకాశం వుండదు!)

**ఎం. బి. ఆర్. — బైపల్లి**

జీవితంలో తీయని వూహలే తీరని కోరికలయితే జీవితంతాన్ని ఎలా సంతృప్తిపరచుకోను? కామెంట్ ప్లీజ్.

చూడు బాబూరావు—నే రాసుకునే బల్ల మీద చిన్న స్క్రూ దొరికింది. అది నీదేనని నా అనుమానం—కార్డుతో పాటు పోస్టుబాక్సులో పారేసుకొని వుంటావు! లేకపోతే ఏమిటీ గోల?!

**కె. జి. ఎస్. కె. కుప్పం**

ఎవరి కవిత్వం మీకు బాగా నచ్చుతుంది?

అందరి కవిత్వం చదువుతాను— కవిత్వం చదవడం—నా హాబీ.

సంసారం పురోగమించడానికైనా— పతనానికైనా స్త్రీ ఒక్కతే ముఖ్యకారణమా?

కాదు—కాదు. కాదు. భార్యాభర్తలిద్దరే కాదు— సంసార రథం సాగడానికి సాఫీగా రోడ్డు లేకపోవడం కూడా కారణం.

**కె. జి. ఎస్. — మహబూబ్‌నగరం**

బహు భర్తృత్వం అశాస్త్రీయం కదా— మరి ద్రవుపతికిఐదుగురుభర్తలుండడం శాస్త్రీయమా?

ఆ రోజుల్లో, అయినా "సూత్రాలేతాలు సూత్ర నిరూపణ కాదు" అన్న సత్యం గ్రహించ లేదా తమరు?

ఏమిటి - వంకాయ కూర చేయడం ఎలానా - ముందు వంకాయలు, ఉల్లిపాయలు తరిగాలి-గిన్నె పొయ్యిమీద పెట్టి నూనె పోసి....






రోహిణీ కార్తె రోజులు.

ఎండలు విరగ కాస్తున్నాయి. ప్రతి సంవత్సరం కట్టేసినట్లే కాలవలు కట్టేశారు. అయినా, ఆ వూరి కాలవ కట్టేసినా గుడి దగ్గరున్న రేవులో మాత్రం నీళ్ళు దండిగా వుంటాయి. అది గుండాలరేవు. మిగతా ప్రదేశంలో మోకాలికి మించి నీరుండదు.

ఆ రోజు—

సూర్యుడు వుదయించకుండానే ఆ వూరి జనం కాలవ చేరుకొన్నారు. కాలవలో చేపలు పడుతున్నారు. ఎవరి శక్తి వారిది. కర్రలు పుచ్చుకొని చేప కనిపించగానే నీళ్ళమీద టపీమని బాది, అది చావగానే బుట్టలో వేసుకొనేవాళ్ళు, వలలు వేసి ఘనంగా చేపలు పొందేవాళ్ళు, గట్టునే నిలబడి పెద్ద చేప పడుతుందేమో, డబ్బిచ్చి తన్నుకుపోవచ్చునని ఎదురుచూసే వాళ్ళతో కాలవ రెండు గట్లూ కలకలలాడి పోతున్నాయి. చిన్నా, పెద్దా, ఆడా, మగా అనే వివక్షత లేకుండా చేపల కోసం కుస్తీ పడుతున్నారు.

శివుడు అప్పుడే వచ్చాడు. అతని చేతిలో కర్ర, గిన్నే వున్నాయి. కాలవలో దిగడానికి సంశయిస్తున్నాడు. అతనికి పదేళ్ళుంటాయి. సన్నగా నల్లగా వుంటాడు. ముఖంలో చురుకు

దనం కంటే, భయమే యెప్పుడు కనిపిస్తుం టుంది. కొన్ని క్షణాలపాటు గట్టున నిలబడి, నీళ్లల్లో జరుగుతున్న సంరంభాన్ని చూస్తూ అనుభవంలేని తనెలా చేపలు పట్టాలో అవగాహన చేసుకొంటున్నాడు. ఎండముదురు తోంది. పావుగంట గడిచింది. చేపలతో బుట్టలు నింపుకొని బయటకొచ్చి అమ్మేసి మళ్ళీ నీళ్ళల్లోకి వెడుతున్నారు. శివుడు కాసేపలాగే నిలబడి, ఆనక ధైర్యంతెచ్చుకొని మెల్లగా మెట్టు దిగాడు గుండందేవు కవతల. అతని కళ్ళు చురుగ్గా పని చేస్తున్నాయి. నీళ్ళలో టపటప చప్పుళ్ళు దీపావళినిగుర్తుకు తెస్తున్నాయి. కనిపించినచేపని కొడుతున్నాడు అయితే, యే ఒక చేప దెబ్బకందడం లేదు. పట్టువదలని విక్రమార్కుడిలా తన ప్రయత్నం సాగిస్తూనే వున్నాడు. అయినా ఫలితం శూన్యం. కాలం గడిచేకొద్దీ అలసట పెరుగు తోంది. చేపలు దొరకలేదనే బాధకంటే, యింటి దగ్గర తల్లేమంటుందోన్న భయమే శివుణ్ని వూపిరి తీయనీయడంలేదు. పైకి, నిలబడి ధైర్యంగా వున్నట్లున్నాడేగానీ, లోలోపల వణికిపోతున్నాడు. అంతలో కాలి కింద ఏదో తగిలింది. అడుగు తీశాడు. ఒక పెద్ద చేప పైకి లేచింది. వెంటనే గట్టిగా కర్రతో కొట్టాడు. తగలవలసిన చోట తగలడంవల్ల, చేపకి తల తిరిగింది. చేపని చేతిలోకి తీసుకోబోతూండగా, బలమైన చేయి మరొకటి వచ్చి ఆ చేపను లాక్కుంది.

'ఈ చేప నాది' అన్నాడు శివుడు.

'ఏడిసావ్, యిది నేను అక్కడ కొట్టిన చేప' అన్నాడా వ్యక్తి.

'కాదు' శివుడికి ఏడుపు వస్తోంది. ఆ వ్యక్తి చేతిలోని చేప లాక్కోబోయాడు.

'ఓరి ఎదవా! నా చేతిలో చేప లాక్కుం దామనే!' అనేసి వెళ్ళిపోయాడతను చేప పుచ్చుకొని.

శివుడు బిక్కముఖం వేసుకొని, చూస్తూ నిలబడిపోయాడు. కాసేపు తంటాలుపడ్డాడు. రెండు చేపపిల్లలు సంపాదించగలిగాడు. ఎండ బలిసింది. జనం వెళ్ళిపోతున్నారు. నీళ్ళు బురదై కంపు కొడుతున్నాయి. మెల్లగా శివుడు గట్టెక్కాడు. ఇంటివైపు అడుగులు వేస్తున్నాడు. కడుపులో ఆకలి దొలిచేస్తోంది. ఇంటికొచ్చాడు. గుమ్మంలో తల్లి ఎదురై,

'ఏరా! శివా! చేపలు పట్టుకొచ్చావా!' అంది ఆత్రుతగా.

శివుడు భయం భయంగా తల్లి వంక చూస్తూ చేతిలో గిన్నె యిచ్చాడు ఆమె గిన్నె లోపలికి చూసి, కోపంగా గిన్నె గిరవాటు వేసింది

'ఎదవా, ఎంతో ముద్దిపెంగా రెండు చేపలు తెచ్చాడు తిండి తినడానికి తప్ప దేనికీ పని చెయ్యవు నువ్వు'

శివుడు తల వంచుకున్నాడు.

"ఆ సుబ్బిగాడు, ఎంకడు, రాముడు చూడెల్లి, యెన్నెన్ని చేపలట్టుకొచ్చారో. ఎదవన్నరెదవా, సిగ్గులేదూ, ఎందుకొచ్చిన బతుకురా, యెల్లి చావు." అంది కోపంగా.

శివుడు తల దించుకునే వున్నాడు తల్లికి వినిపించకుండా యేడుస్తున్నాడు.

'ఈవేళ నీక్కూడెట్టను యెల్లి యెవరితో చెప్పకుంటావో చెప్పుకో" అనేసి విసురుగా లోపలికెళ్ళిపోయిందామె

"అమ్మా! ఆకలవుతోందే' బయటనుంచి శివుడు బాధగా అడిగాడు.

ఆమె హృదయం కరగలేదు. కొడుకు పనికిరాని వాడుగా తయారౌతున్నాడన్నదే ఆమె బాధ. అంతే కాకుండా ప్రక్కింటి వాళ్ళు డబ్బు కూడా బాగా సంపాదించారు. ఆ కుర్రాళ్ళు కూడా శివుడు తోటివాళ్ళే.

"ఆకలయితే చావు చచ్చినా నీకీయేల కూడెట్టను' ఖచ్చితంగా అనేసిందామె లోపల్నుంచి.

శివుడు మెల్లగా అక్కడే జాగా చూసుకుని కూర్చున్నాడు. బురద నీళ్ళల్లోంచివచ్చాడేమో నీళ్ళెండిపోయి, శరీరం మట్టితో పెళు సెక్కింది. ముఖం నీరసంగా వుంది. ఒక విధమైన నిర్లిప్తత అతనిలో చోటుచేసు కుంది. పావుగంటలాగే కూర్చున్నాడు. తర్వాత లేచి బయటకొచ్చాడు ఏదో చెయ్యాలని... అది చేసేసి తల్లిని తృప్తిపరచాలనుందతనికి. చేపలెలా సంపాదించాలి? అనే ప్రశ్నతో నడు స్తున్నాడు. చేపలతోనే తిరిగి యింటి గుమ్మ మెక్కాలి—అనే నిర్ణయంతో నడుస్తున్నాడు. అలా నడచి దేవాలయం దగ్గరికి చేరుకున్నాడు. నీరసంతో కాళ్ళు తేలిపోతున్నాయి. కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. చాలాసేపు ఆలో చించాడు. 'రాత్రి పడితే ఎవరూ వుండరు. అప్పుడు హాయిగా చేపలు పట్టుకోవచ్చు. చీకట్లో చేపలు కనిపించవగ్గూ! మరెలా! మిట్టమధ్యాహ్నం పడితేసరి ఎవరూ వుండరు. అదే మంచిది' అని నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయ మతనిలో నూతనోత్సాహం కలిగిం చింది. తప్పకుండా చేపలు దొరుకుతాయన్న ధైర్యమతనిలో నిండుగా కలిగింది సమయం కోసం ఎదురు చూస్తున్నాడు. సూర్యుడు నడినెత్తికి వచ్చేసరికి లేచి నిలబడ్డాడు. దాహం వేసింది. కొద్ది దూరంలో వున్న యింటికెళ్ళి దాహం తీర్చుకువచ్చాడు కర్ర పుచ్చుకుని కాలవలో దిగాడు. ఒక్కసారి నీటిలో కలకలం పుట్టించాడు. ఒక్క చేప కనబడలేదు! కాస్త ముందుకు వెళ్ళాడు. మళ్ళీ కలకలం పుట్టించాడు! ఒకమాదిరి చేప కనబడింది టపీమని బాదాడు. అది శివుడి చేతిలో పడింది. దాంతో ద్విగుణీకృతమైన ఉత్సాహంతో తీవ్రంగా గాలించడం మొదలు పెట్టాడు కలకలం మళ్ళీ పుట్టించాడు. అంతే, ఒక పెద్ద చేప అతని దృష్టిలో పడింది కొట్టాడు. దెబ్బ తగల్లేదు. ముందు కెళ్ళింది. శివుడు ముందుకెళ్ళాడు. మళ్ళీ కనిపించింది చేప. అది నీళ్ళలో ముందు కురికింది. శివుడు గబగబా ముందుకెళ్ళాడు కొట్టడానికి. అంతే, ఒక్కసారి నీళ్ళల్లో మునిగిపోయాడు. అక్కడే గుండముందనే విషయమతనికి తెలియదు. ఆ సంగతి కూడా లేదక్కడ. నింగిలో సూర్యుడికి తప్ప మరె వ్వరికీ తెలియదు శివుడు నీళ్ళలో మునిగి పోయాడని.



*        *        *

చీకటి పడింది.

నర్సమ్మకి ఆందోళన ప్రారంభమైంది, చీకటి పడినా కొడుకు రాకపోయేటప్పటికి. భర్త చూస్తే పట్నం వెళ్ళాడు. కంగారుగా వుందామెకు వెతకడానికి బయల్దేరబోతోంది.

"ఏమ్మో! నర్సమ్మా, కొంప మునిగి పోయిందే తల్లీ!" అంటూ వచ్చింది ప్రక్కింటి గౌరి.

"ఏంటే!"

"ఏంటని అడుగుతావేంటే తల్లీ! నీ కొడుకు కాలవలోపడి చచ్చిపోయాట్ట గుండం రేవులో తేలి వున్నాట్ట!" అంది.

అంతే! నర్సమ్మ గుండెలు బాదుకుంటూ పరిగెత్తింది. దిక్కులు పిక్కటిల్లేలా ఏడుస్తోంది. గుండం రేవు చేరికొంది.

"అయ్యో, నా బిడ్డా!" అని బావురు మంది. నీళ్ళల్లో తేలుతున్న కొడుకును చూసి.

"నా బిడ్డని నేనే చంపుకున్నాన రో!" అంటూ తల బాదుకొంటోంది. ఎవరూ ఆమెను ఆపలేక పోతున్నారు. శివుడి శవాన్ని తీసుకువచ్చారు నర్సమ్మ, కొడుకు శవాన్ని వళ్ళోకి తీసికుంది. వళ్ళంతా తడిమింది. లాగుజేబు దగ్గర ఏదో తగలటంవల్ల జేబులో చేయిపెట్టి, లోపల్నుండి బయటికి తీసింది. అది చచ్చిన చేప. దాన్ని చూసేసరికి మరింత దుఃఖం వచ్చిందామెకు.

"నేను గుండంలోపడి చచ్చిపోతాను. నేను బతకలేను దేవుడోయ్" అని లేవబోయింది. అక్కడున్నారందరూ గట్టిగా పట్టుకుని నేలమీద కుదేసి కూర్చోపెట్టారు.

మాతృ హృదయపు బాధని అర్థం చేసికుని, నర్సమ్మవైపు సానుభూతిగా చూస్తున్న అక్కడి ఆడవాళ్ల కళ్ళ వెంబడి కన్నీరు జలజలా రాలుతోంది. రాబోయేది వూహించక, పిల్లలపై నోరు పడేసుకుని, ఆనక ఘోరం జరిగాక తల్లడిల్లిపోయే పేద మాతృ హృదయాలెన్నో ఈ జగతిలో?! అందుకే ముందు చూపు అవసరం.

# వారఫలం

**17 9 1982 శుక్రవారంమొదలు 23-9 1982 గురువారం వరకు**

★**మేషం** — చాల మార్పులు గ్రహగతిలో ఏర్పడి వాయి, అందు మూలాన మీరు విషయ పరిష్కారంలో ఉద్రేకులు కారాదు బంధు విరోధంతగదు. అప్పులు వసూలయేమార్గం ఉన్నది. గ్రహించండి. స్త్రీలకు : గృహానందం, శాంతి జీవనం, గౌరవం, లాభంగల వారం.

★**వృషభం** — ధన లబ్దిగల వారం. సాంఘికంగా మీకు లాభించేమార్గం ఉన్నది శ్రమించాలి ఉద్యోగంలో కొందరకు ప్రమోషన్‌కు అవకాశం, రాజకీయంగామీకు మేలు జరిగే అవకాశం గల వారమే గ్రహించండి. స్త్రీలకు · దూర బంధువులతో స్నేహం, మిత్రుల వలన లాభం, ఉన్నత విద్యానుకూలతకు అవకాశం గిలదు.

★**మిథునం**·—ఆదాయం గలవారం. అభిమానుల ఆదరణ, ఆప్యాయత లభించే మార్గమున్నది.. నూతన మార్గాన లాభదాయకమే సాయంకాలానికి ఒకానొక విషయం సానుకూలంకాగిలదు. స్త్రీలకు అధికసంతోషానికి, శుభకార్య ప్రస్తావనలకు, రచనా వ్యాసంగం ఫలించే అవకాశం గలవారం·

★**కర్కాటకం** — మీకు వ్యాపారంలో పోటీ అతిశయించే మార్గం ఉన్నది నలుగురిలో పేరుప్రతిష్టలు తెచ్చికోవాలనితాపత్రయం సర్వదాశ్లాఘ్యం రాజకీయ రంగానఈ రాశివారికి ఏదో మేలు చేకూరే మార్గం ఉన్నది. స్త్రీలకు : సంతాన మూలకంగా ఆనందం, కొందరకుశుభకార్యానుకూలత గలవారం.

★**సింహం** — ఎలాగైనా పోయినదనుకొన్నధనం రాబట్టుకోగలరు చాలమందికి అప్పులువసూలయ్యే మార్గం గలవారం. ప్రయాణానుకూలత చాల మందికి చెప్పదగినవారం. వ్యాపారంలోని మార్పులు మేలైనవే స్త్రీలకు : సుఖ శాంతులకు, ఉద్యోగంలో మేలు పొందుటకు అనుకూలమే.

★**కన్య** — చాల విధాల శ్రమ కరమైనవారం 'కష్టే ఫలి' అన్నారుగా! ఓర్పుతో మీ పనులుసర్దుబాటుచేసికోండి. నూతన మిత్ర బంధువుల వలన మేలు చేకూరగలవారం. స్త్రీలకు : రచనా విధానం ఫలితానికి రావటం, రాజకీయరంగ ప్రవేశకులకు మేలు జరిగే వారమే· ప్రయత్నించండి.

★**తుల**·—శాంతియుతంగా మీ పనులు నెరవేర్చికోండి వ్యయంఅధికంగా చేయవలసిన పరిస్థితులు ఉంటాయి. ప్రయాణాల్లో ప్రమాదాలు సంభవం. దాయాదుల వలన ఇబ్బంది ఏర్పడ నున్నది. స్త్రీలకు : కుటుంబంలో కలతలు ఏర్పడుటకు, సులభంగా జరగవలసిన కార్యాలకు ఇబ్బంది కలగటం గమనించాలి

★**వృశ్చికం** :— నూతనవ్యాపారంలో నూతనావకాశాలుంటాయి. సుఖ శాంతులకు అధికోత్సాహానికి ధనరాబడికి సర్వానుకూలతగల వారం భూములు కొనుగోలు చేయాలనీ, నూతన వస్తు సేకరణకు ఉత్సాహంగా నడుము కడుతారు. స్త్రీలకు చాల మందికి వృత్తి ఉద్యోగాలలో, కొందరకు రాజకీయంగా మేలు చేకూరే వారం.

★**ధనుస్సు** :—సమధికోత్సాహంతో కొందరు 'ఫ్యాక్టరీ' నిర్మాణానికి, కొందరు, చిత్ర నిర్మాణానికి కొందరు భూములుకొనాలనీ ప్రయత్నించదగిన వారం ఇటీవల ఇలాగు చక్కని గ్రహస్థితిగల, లాభదాయకమైన 'వారంరోజులు' కనిపించలేదనిపించే లాగు కాలం జరుగుతుంది. స్త్రీలకు : అధిక గౌరవానికి, అందవలసిన డబ్బు అందటానికి ఆక్షేపణ లేదు.

★**మకరం** :— ఉపకారంపొందిన వారున్నారుగా! వారు అనుకోకుండానే మీకుసహాయ సంపత్తులు అందింప నున్నారు. జరుగుచున్న వ్యాపారంలో ఒడిదుడుకులు రాకుండా చూచుకోవటమేగాక, అప్పు సప్పుగా ఇచ్చిన ధనంవసూలుచేసికోవటానికిప్రయత్నించాలి. స్త్రీలకు. అధికారుల ఆదరణ, ఆయివోజా పెరగటం, గమనించదగిన అంశాలు.

★**కుంభం** :— నటనారంగంలో, చిత్రరంగంలో ప్రసిద్ధులకుసదవకాశాలులభించగలవు రాజకీయంగా యత్నించి వదలిన కార్యక్రమం మరలా ప్రారంభించ నున్నారు. యత్నకార్యంలో అనుకూలత గలదు. స్త్రీలకు · కొత్త బట్టలు కొనటం, బంధువులను కలిసికోదలచు కొనటం, శుభకార్య ప్రస్తావనలకు అనుకూలత గల వారమే.

★**మీనం** :— నోరుమంచిదైతే వూరుమంచిది! ముఖ్యంగా ఈవారం అధికారులతో, ఆప్తులతో, అనకూలురతో సంభాషణాకార్యంలో ఎంతోజాగ్రత్తగా ఉండాలి స్త్రీలకు : దైవకార్యాచరణకు, ఉద్యోగంలో అంతస్తు పెరుగుటకు, ధనలబ్ధికి అవకాశం గల వారమే.

విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి *

# అవీ... ఇవీ... అన్నీ...



1982వ సంవత్సరానికి రాజాలక్ష్మి అవార్డుకి ఎన్నికైన ప్రఖ్యాత చిత్రకారుడు, ప్రముఖ సినీ దర్శకుడు శ్రీ బాపు.

## నెల్లూరులో అక్కినేని జన్మదినం

నటసామ్రాట్ డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు గారి జన్మదినాన్ని నెల్లూరు అక్కినేని ఆర్ట్స్ వారు సెప్టెంబరు 19, 20 తేదీలలో అతి వైభవంగా జరుప నిశ్చయించారని, ఈసందర్భంగా తెలుగు సినిమా పాటలలోను, లలితసంగీతంలోను, రికార్డు డ్యాన్సులలోను, ఏకపాత్రాభినయంలోను అఖిల భారత స్థాయిలో పోటీలు నిర్వహించ దలిచారని, పై పోటీలకు న్యాయ నిర్ణేతలుగా సినీ సంగీత దర్శకులు, సినీ నృత్య దర్శకులు, సినీ దర్శకులు వ్యవహరిస్తారని, సెప్టెంబరు 20వ తేది అక్కినేని జన్మదినం రోజున రెండు సార్లు జాతీయ బహుమతి గ్రహీత సినీ నేపథ్య గాయకుడు శ్రీ ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యంను సన్మానించదలిచారని సంస్థ కార్యదర్శి తెలియజేశారు వివరాలకు సెక్రెటరీ, అక్కినేని ఆర్ట్స్ అసోసియేషన్, నియర్ అనితా హాల్, నెల్లూరు—524 003కి రాయాలి.

## ఆత్మల మూడు కాలముల కథ

ప్రజాపిత బ్రహ్మకుమారీ ఈశ్వరీయ విశ్వ విద్యాలయము వారి ప్రచురణ. 68 పేజీలు వెల 2 రూపాయలు. ప్రతులకు ప్రజాపిత బ్రహ్మ కుమారీ ఈశ్వరీయవిశ్వవిద్యాలయము, హెడ్ ఆఫీసు పాండవ భవన్, మవుంట్ అబు (రాజస్థాన్), లేదా బ్రాంచి ఆఫీసు, 11/185, శివాలయ వీధి మదనపల్లె—517 325 (చిత్తూరు జిల్లా)

## వాసవి శ్రీ కన్యక

రచన శ్రీ మోరా వామనాచార్యులు 32 పేజీలు. వెల రు 1—25 ప్రతులకు రచయిత పేర, రాజన్నగూడెం గ్రామం, నిడమనూరు పోస్ట్, మిర్యాలగూడెం తాలూకా, నల్గొండ జిల్లాకి వ్రాయాలి.

## సమతారచయితల సంఘం

అమలాపురం సమతా రచయితలసంఘం రాష్ట్ర స్థాయిలో 1981—82 సంవత్సరాల్లో వెలువడిన కవితా సంపుటాలలో ఉత్తమ కవితా సంపుటానికి రు. 116 లు మరియు షీల్డు బహుమతి ఇవ్వ సంకల్పించింది కావున రచయితలు తమతమ సంపుటాలను సెప్టెంబరు 10వ తేదీలోగా ఈ క్రింది చిరునామాకు పంపవలెను వివిధ కవులు కలిసి వ్రాసిన సంకలనాలు మాత్రం పోటీకి అంగీకరించబడవు. 1981—82 సంవత్సరముల కాలంలోనే సంపుటాలు ప్రచురణ జరిగి ఉండవలెను ప్రతి పుస్తకం రెండేసి ప్రతులు చొప్పున పంపవలసిన చిరునామా . శ్రీ చక్కా సత్యనారాయణమూర్తి, కార్యదర్శి సం. ర. సం, చిన్నమసీదు ఎదుట, అమలాపురం—533 201.

## మంచి రోజు

కథల సంపుటి రచన • శ్రీ కేశవరావు • 64 పేజీలు గల ఈ పుస్తకంలో ప్రకటన, ఆశాదీపం, సేల్స్‌మన్, మనస్తాపం,బట్టల పంపకం, మంచి రోజు అన్న ఆరు కథలు ఉన్నాయి. వెల రు 6 50 రు లు ప్రతులకు ఫీడం ప్రెస్, 1—1—261 10, చిక్కడపల్లి, హైదరాబాదు—500 020. లేదా రచయిత పేర, 58, కోడంబాకం హైరోడ్, రైన్‌బో హోటల్ ఎదురుగా, నార్త్ టి నగర్, మదరాసు—600 017.

## కలియుగ వైతాళికుడు శ్రీ వీరబ్రహ్మేంద్రుడు

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్రము. రచన శ్రీ మోరా వామనాచార్యులు 184 పేజీలు. వెల 10 రూపాయలు. ప్రతులకు రచయిత పేర, రాజన్నగూడెం, మిర్యాలగూడెం తాలూకా నల్గొండ జిల్లా లేక శ్రీ మోరా నారాయణాచార్యులు, దేవరకొండ అన్న చిరునామాకి రాయాలి.



ఇటీవల కడపలో జానపద సంగీత సాహిత్య పరిషత్తుకి డా॥ సి. నారాయణరెడ్డి ప్రారంభోత్సవం చేసిన సందర్భంగా శ్రీ ఆరవేటి శ్రీనివాసులు ప్రసంగిస్తున్న దృశ్యం. డా. పుట్టపర్తి నారాయణాచార్యులు, డా. ఆర్. ఎ. పద్మనాభరావ్, శ్రీ హెచ్. హృషికేశవరావ్‌లని కూడా చిత్రంలో చూడవచ్చు.

## అవీ ఇవీ అన్నీ

### శ్రీ వేంకటేశ్వర భక్తి కాంచనమాల నందనందన స్తవమాల

శతకము రచన శ్రీ కుప్పిలి సన్యాసిరావు 48 పేజీలు వెల 2 రూపాయలు ప్రతులకు రచయిత పేర, బల్జివీధి, విజయనగరం — 1 అన్న చిరునామాకి రాయాలి

### సువర్ణ భాషితాలు

రచన శ్రీ తాడి వెంకటకృష్ణారావు 64 పేజీలు. వెల 5 రూపాయలు ప్రతులకు 1 శ్రీ రమణా బుక్ డిస్ట్రిబ్యూటర్స్ బ్లాకు నెం సి 6, ఇంటి నెం 22 బి,లారెన్స్ రోడ్డు, న్యూఢిల్లీ— 110 035. 2. శశిశ్రీ పబ్లికేషన్స్, ఇం నెం. 10 3 192/2 హుమాయూన్ నగర్, హైదరాబాదు —500 028.

### దివ్యగురు శ్రీశ్రీశ్రీ జ్యోతిర్మయ ప్రభువారి అమృతసందేశము

విశ్వశాంతి జ్యోతి ప్రచురణ 20 పేజీలు వెల 2 రూపాయలు ప్రతులకు 1 విశ్వశాంతిజ్యోతి ప్రచార సమితి, జ్యోతిస్థాన్, శాంతిగిరి దివ్యదార్, పెద్దాపురం— 533 437 2. సెక్రెటరీ, జ్యోతిస్థాన్. శాంతిగిరి, గాజువాక విశాఖపట్నం— 530 026 3 శ్రీ విశ్వశాంతి జ్యోతి భక్త మండలి, చలంవీధి, ఆళ్ళగడ్డ, కర్నూలు జిల్లా.

### చైతన్య

సింహపురి సాహితీ సమాఖ్య వారి ద్వితీయ కవితా సంకలనం 36 పేజీలు వెల 5 రూపాయలు. ప్రతులకు సింహపురి సాహితీసమాఖ్య 10/170, సంతపేట, నెల్లూరు —1.

### శ్రీ ఈశ్వరీ మహాదేవి చరిత్రము

సంక్షిప్త వచన కావ్యము. రచన : శ్రీ మోరా వామనాచార్యులు. 18 పేజీలు. వెల 0 50 పై. ప్రతులకు : శ్రీ వామన పబ్లికేషన్స్, రాజన్నగూడెం తాలూకా, నల్గొండజిల్లా.



# వంటలు

## టొమేటో మోదక్

కావలసిన వస్తువులు :— టొమేటోలు అర్ధకిలో, మామిడి కాయలు 2, కొబ్బరి తురుము మూడు కప్పులు, బియ్యంపిండి ఒక లీటరు, పొడి చేసిన బెల్లం ఆరు టీ స్పూన్లు, ఆవాలు ఒక టీ స్పూను, మినప్పప్పు ఒక టీ స్పూను, మిరప్పొడి నాలుగు టీ స్పూన్లు, తగినంత ఉప్పు, నెయ్యి, కరివేపాకు

తయారుచేయు విధము :— ముందుగా టొమేటోలను వేడి నీటిలో కాస్సేపు నాన పెట్టి, పై తోలు మాత్రం తీసేయాలి మామిడి కాయలకు చెక్కు తీసేసి సన్నగా తురుముకోవాలి ఇపుడు బాణలిలో కొద్దిగా నెయ్యి వేసి కాగాక ఆవాలు, మినప్పప్పు వేసి చిటపట లాడాక కరివేపాకు వేసి, తర్వాత మామిడికాయ తురుము వేసి వేయించాలి. సగం వేగిన తర్వాత టొమేటోలను, ఉప్పు, మిరప్పొడి వేసి వేయించాలి. చివరగా కొబ్బరి తురుము, బెల్లంపొడి కూడ వేసి బాగా కలిపి దించాలి ఇదే పూర్ణం.

తర్వాత బియ్యంపిండిని బాణలిలో పోసి పొయ్యి పై పెట్టి కొద్దిగా దోరగా వేయించి దించాలి. వేడినీటికి కొదిగా ఉప్పు కలిపి తీసుకోవాలి ఈ వేడినీటిని కొద్ది కొద్దిగా బియ్యంపిండిలోకి పోసి బాగా గట్టిగ వుండే టట్లు కలపాలి ఈ పిండిని కొద్దిగా తీసుకుని కుడుములకు వేసుకున్నట్లు గిన్నె ఆకారంలో చేయాలి. దానిలోకి ముందుగా చేసిన పూర్ణమును తగినంత పెట్టి మూసే యాలి. ఈ విధంగా మొత్తం చేయాలి. ఇవే మోదకాలు వీటిని ఒక పాత్రలో పెట్టి ఆవిరిమీద వుడికించి దించాలి ఈ టొమేటో మోదక్ తియ్యగా, పుల్లగా, కారంగా, భలే రుచిగా వుంటుంది.

— గార్ల సరస్వతి

## సాబూదాల్

కావల్సిన సామాన్లు : సగ్గుబియ్యం — కప్పు, పెసరపప్పు — కప్పు, ఉల్లిపాయలు — రెండు, డాల్డా — 50 గ్రా., పచ్చిమిర్చి — రెండు, కారం — స్పూను, కొత్తిమీర — కట్ట, ఉప్పు, నిమ్మకాయ — ఒకటి.

తయారుచేయు విధానము : పెసరపప్పు బాగుచేసి నీళ్లల్లో ఒక గంటసేపు నాన బెట్టాలి. బాణలిలో డాల్డా పోసి కాగబెట్టి సగ్గుబియ్యం పోసి గుల్లగా అయ్యేవరకు వేయించి గిన్నెలోకి తీసి పెట్టుకోవాలి నానిన పెసరపప్పును నీళ్లు ఓడ్చి పొడి బట్టలోపోసి మూటగట్టి పెట్టుకోవాలి.

పచ్చిమిర్చి, కొత్తిమీర, ఉలి పాయలు సన్నగా తరిగి, వేయించిన సగ్గుబియ్యంలో వేసి, ఉప్పు, కారం కూడా వేసి బాగా కలిపి ఉంచాలి సర్వ్ చేసేముందు నిమ్మరసం కలపాలి. పెసరపప్పును సగ్గుబియ్యంలో వేసి నిమ్మరసం పోసి సర్వ్‌చేస్తే బాగుంటుంది. ముందుగా నిమ్మరసం వేస్తే సగ్గుబియ్యం గట్టి అయిపోతాయి. మధ్యాహ్నం టిఫిన్‌గా బాగుంటుంది 'సాబూదాల్.'

— వల్లిశ్రీ నాగరాజ్

# తురయీ బాత్

కావలసినవి : సన్నబియ్యం— అర కేజి, లేత బీరకాయలు — 4, నెయ్యి లేక డాల్డా — 1 కప్పు, ఎండు కొబ్బరిచిప్ప—1, పెద్ద ఉల్లి పాయలు—4, వెల్లుల్లి—4, టమోటాలు—4, పచ్చిమిర్చి—8, పసుపు—1 స్పూను, పుదీనా ఆకులు—కొంచెం, ఉప్పు—కొంచెం.

చేయు విధానం: మొదట పొయ్యిమీద పెద్ద గిన్నె పెట్టి నెయ్యివేసి, ఉల్లిపాయలు, వెల్లుల్లి, పచ్చిమిర్చి, టమోటాలు పొడవుగా సన్నగా తరిగి వేయాలి. బీరకాయలు చెక్కు తీసి చిన్న ముక్కలుగా తరిగి వేయాలి. దోరగా వేగిన తరువాత అర కె.జి బియ్యానికి తగినన్ని నీళ్ళు, వేయించిన ముక్కలలో పోసి పసుపువేసి మూత పెట్టాలి. బియ్యం బాగా కడిగి నీళ్ళన్నీ వంచేసి పెట్టుకోవాలి. గిన్నెలోని ఎసరు కాగగానే బియ్యం కూడా వేసి సన్నని సెగను ఉడకనివ్వాలి. ఎండుకొబ్బరి తురిమి ఉడుకుతున్న అన్నంలో వేసి కలపాలి ఉప్పు పొడి చేసి, పుదీనా ఆకులుతిరిగి అన్నంలో వేసి బాగాఉడికి నీళ్ళు ఇగిరిన తర్వాత దింపుకోవాలి. దీనిలోకి పెరుగు చట్నీ ఆధరువుగా బాగుంటుంది.

— కె రాజేశ్వరి

## గ్రుడ్డుతో గులాబి పువ్వులు

కావలసిన వస్తువులు:— పావుకేజి మైదా పిండి, 1 కొబ్బరికాయ, 3 కోడి గ్రుడ్లు, 100 గ్రా. పంచదార, 6 ఏలకులు, పావుకేజి నూనె, చిటికెడు తినే సోడాఉప్పు.

చేయు విధానం :— ముందర కొబ్బరి తురిమి రోట్లో వేసి రుబ్బి పాలు తియ్యాలి. ఆ పాలలో గ్రుడ్లు కొట్టివేసి, మైదాపిండి కూడా వేసి, దోసెల పిండి మాదిరిగా కలుపుకోవాలి. ఈ ముద్దలో సోడాఉప్పు, ఏలకగుండ కూడా వేసి కలపాలి.

బాణాలిలో నూనె పోసి స్టౌమీద పెట్టి, మరిగాక, గులాబి పువ్వులు తయారు చేసే గుత్తి ఇనపది తీసుకుని, ఆ పిండిలో ముంచి మరిగిన నూనెలో ఆ గుత్తి పూర్తిగా మునిగేలా కొంచెం కొంచెం ముంచుతూ వుండాలి. ఆ పిండి పూవు ఆ నూనెలో వేగుతుంది. ఎర్రగా వేగిన తర్వాత తీసి చల్లారాక ఒక డబ్బాలోవేసి మూత పెట్టాలి. ఇవి రెండు నెలలు నిల్వ వుంటాయి. ఆరోగ్యకరమైనవి.

— డి. సుధాలహరి

# హైదరాబాద్ నోట్ బుక్

## తిరుమల రామచంద్ర

**శ్రీ యెల్లా శివతాండవధ్వన్యాలోకం :**

శివ తాండవాన్ని సృష్టి స్థితిలయాలకు ప్రతీకగా వర్ణించారు ఆనంద కుమార స్వామి అసాధారణ ప్రతిభతో, అసంఖ్యాక పుటలలో, వివిధ పాకాలలో వున్న ఆ పుటల పటలాలను పటించి ఆకళించుకొనే ఓపిక వున్న వారికే శివ తాండవ రహస్యం ఎంతో కొంత హృదయానికి హత్తుకుంటుంది. ఇక పల్లవ, చోళ, చాళుక్య శిల్ప రాట్టులు గండరించిన నటరాజ తాండవమూర్తులనుదర్శిస్తూంటే, శిల్ప భరత శాస్త్ర రహస్యాలు తెలియనివారు కూడ తాండవంలో లీనమవుతారు. అయితే దీనికి పంచ జ్ఞానేంద్రియాలలో ప్రధానమైన కన్నులు కావాలి. కన్నులులేని కబోదులకు కూడ శివ తాండవచ్ఛటలను కనుల గట్టేట్టు చేసే ధ్వన్యాలోకం మిత్రులు శ్రీ యెల్లా వెంకటేశ్వరరావు శంకర విశ్వ తాండవ శబ్ద రూపకం. శ్రీ యెల్లా ఆగస్టు 13 వ తేదీ సాయంకాలం రవీంద్ర భారతిలో మూడు గంటల పాటు శివ తాండవ ధ్వని దృశ్యాలను మృదంగ వాదనంలో చూపి, ప్రేక్షకులను, శ్రోతలను కైలాసగిరి సానువులలో సంచరింపజేశారు. సాధారణంగా శివ తాండవం భరత శాస్త్రాను సారంగా ప్రదర్శితమవుతున్నది. కాని శ్రీ యెల్లా విశ్వతాండవంలో అంతర్లీనమైన విశ్వనాదాన్ని—ఓంకారాన్నిగ్రహించి, దానిని తమ ఉదాత్త మృదంగంపై తొలిసారిగా శబ్ద చిత్రంగా రూపొందించి ఆకాశవాణి ద్వారా ప్రసారం చేశారు.

అఖిల భారత స్థాయిలో ఢిల్లీ ఆకాశవాణికేంద్రం స్వీకరించిన అన్ని రాష్ట్రాల ఆరోపాలలోను శ్రీ ఎల్లా శివతాండవం ఉత్తమమైందిగా ఎన్నికయి, ఇండోనీషియాలో జరిగిన అంతర్జాతీయ సంగీతోత్సవాల పోటీకి వెళ్ళింది. 79 దేశాలు పాల్గొన్న ఈ ఉత్సవంలో ప్రథమ బహుమతి సంపాదించి భారత దేశానికి ముఖ్యంగా తెలుగు దేశానికి ఘనకీర్తి సంపాదించింది. దానినే శ్రీ యెల్లా సజాతీయ విజాతీయ వాద్యాల సమ్మేళనంతో మరికొంత విస్తరించిమూడు గంటల ధ్వని రూపకంగా తీర్చారు. దానినే ఆగస్టు 13 వ తేదీన సహృదయులు ఆస్వాదించి ఆనంద తన్మయు లయ్యారు. ఈ శివతాండవం గోదావరి ఏడు పాయలయినట్టు సప్తస్వరూపాలు దాల్చింది—ఆనంద తాండవం, సంధ్యా తాండవం, కలికతాండవం, విజయ తాండవం, పూర్వ తాండవం, ఉమా తాండవం, సంహార తాండవం అని. వీటిలో ఒక్కొక్కటీ జగ దుద్భవ పూర్వ రూప, ప్రాదుర్భావ, కోరక, పూర్ణ, పారవశ్య, పరిణామ, ప్రళయాలకు ప్రతీకలు. ప్రళయానంతరం మరల సృష్టి. ఇలా ఇది చక్రనేమి క్రమం. ఈ చక్రనేమి తిరిగిన చోటికే మరల రావడం కాక శంఖావర్తంగా తిరగడం విశేషం. ఈ తాండవ వైవిధ్యాన్ని శ్రీ యెల్లా తమ మృదంగ నాదంతో ఇంతవరకు ఎవ్వరూ దర్శించని పరమ శివుణ్ణి సాక్షాత్కరింపజేశారు. రవీంద్ర భారతి డైరెక్టర్ శ్రీ ఏ. ఎస్. మూర్తి ఈ తాండవాన్ని తమ మృదు గంభీర కంఠంతో, తాండవాను గుణమైన వైదర్భ్యాది శైలి గుంఫిత రచనతో వ్యాఖ్యానించి, తాండవ రహస్యాన్ని శ్రోతలకు కరతలామలకం చేశారు. ఎంత ఆనందించాము, ఎన్ని కొత్త సంగతులు తెలుసుకున్నాము అనే సంతృప్తి శ్రోతలలో కలిగిందనడానికి వారు ప్రదర్శనానంతరం ఉలిక్కి పడి లేచి, ప్రశాంతంగా వెళ్ళడమే దృష్టాంతం. ఈ ప్రదర్శనాన్ని రాష్ట్ర ప్రభుత్వం, రాష్ట్ర దేవాదాయ ధర్మాదాయ శాఖల సహకారంతో శ్రీశైల, శ్రీ కాళహస్తి, వేములవాడ దేవాలయాలు సమర్పించాయి. ప్రారంభంలో దేవాదాయ ధర్మాదాయ శాఖ కమీషనర్ శ్రీ పి. ఎస్. రాజగోపాలరాజు స్వాగతం చెబుతూ, ఆలయాలు పూర్వం కళా పోషకాలుగా వుండేవని, కాని క్రమంగా ఆ పరిస్థితి క్షీణించిందని, అయితే రాష్ట్ర ప్రభుత్వంపూర్వ వైభవాన్ని పునరుద్ధరించడానికిపూనుకొని కొన్ని పథకాలు నిర్వహిస్తున్నదని, అన్నమాచార్య పథకం వాటిలో ఒక్కటని అన్నారు. ఆ పథకం ఇచ్చిన ప్రోత్సాహంతో రాష్ట్ర ప్రభుత్వ మృదంగ విద్వాంసుడు శ్రీ యెల్లా వేంకటేశ్వరరావు శంకర విశ్వ తాండవ శబ్ద రూపకాన్ని రూపొందించారని అన్నారు. రాష్ట్ర సాంస్కృతిక శాఖా మాత్యులు శ్రీ రామకృష్ణంరాజు ప్రదర్శనాన్ని ప్రారంభిస్తూ, దేవదాయ, ధర్మాదాయ శాఖ రూపొందించిన అన్నమాచార్య పథకం అన్ని రాష్ట్రాలలోను ప్రచారం పొందిందని, తమిళనాడులోని తెలుగు నాయకులు, మాజీ ఎం. ఎల్ ఎ. శ్రీ కె. ఎస్ కోదండ రామయ్య ఈ పథకాన్ని చాల ప్రశంసించారని అన్నారు శివ తాండవంలాగే రామదాసు కీర్తనల రూపకం కూడ రూపొందించామని ఆయన అన్నారు నృత్య నాటకాలను దేవాలయాలలో ఏర్పాటు చేయాలని నృత్య అకాడెమీ అధ్యక్షులు శ్రీ నటరాజ రామ కృష్ణ చేసిన సూచన ప్రకారం ఆ ఏర్పాటు జరుగుతుందని శ్రీ రామకృష్ణంరాజు హామీ ఇచ్చారు. శివ తాండవ ప్రదర్శనను నిర్వహిస్తున్న శ్రీ యెల్లా వేంకటేశ్వరరావు విదేశాలలోను కీర్తి పొందినవారని మంత్రి ప్రశంసించారు. ఆంధ్రప్రదేశ్ అధికార భాషా కమిషన్ అధ్యక్షులు డాక్టర్ సి. నారాయణ రెడ్డి ప్రసంగిస్తూ, "తిన బోతూ రుచు లడుగనేల అన్నట్టు, వినబోతూ శ్రుతు లడుగనేల? ఇది శ్రవ్యం, శ్రావ్యం. శ్రీ యెల్లా వెంకటేశ్వరరావు వేళ్ళు చాల సున్నితంగా వుంటాయి. ఆ వేళ్ళు తాండవాన్నిపలికించే వేళ్ళా—అనిపిస్తుంది ఆయన మృదంగం వాయిస్తూంటే, బుగ్గలు నిమిరినట్టుగా వుంటుంది"—అన్నారు. ఈ ప్రదర్శనాన్ని మహా రంజకంగా చేయడంలో శ్రీ యెల్లా వేంకటేశ్వరరావుతో సహకరించిన తక్కిన కళాకారులు వీరు. సంగీత సహాయం—శ్రీ కన్న బాబు, పర్యవేక్షణ—శ్రీ సత్య నారాయణ, గాత్ర సంగీతం —శ్రీమతి చాయాదేవి, కుమారి జి శోభారాజు, శ్రీ కె బి. మోహన్‌రాజు, శ్రీ కన్నారావు వాద్య సహకారం: వీణ —శ్రీ డి. సీతారామయ్య, వేణువు—శ్రీ దత్తాత్రేయ, వయోలిన్—శ్రీ బ్రహ్మానందం. తబ్లా—శ్రీ కోటిలింగం. శ్రీ మొహసిన్. మృదంగం—శ్రీ ఎం. వెంకటరావు, నట్టువాంగం—శ్రీ పి. రామలింగం, శ్రీసుదర్శన్ కథక్ బోల్సు—శ్రీలంజీ బాబు. మృదంగం, ఘటం—శ్రీ యెల్లా బాల సోమ శేఖర్. మృదంగం, కుంజకోల్—శ్రీ కె సుబ్బారావు, రిథిమ్స్, డమరు—శ్రీకృష్ణ, డోలక్ డోలకీ, రుంజ—శ్రీ యెల్లా దుర్గారావు, గాంగ్, ఎఫెక్ట్స్ శ్రీ యెల్లా బ్రహ్మానంద్, మోర్సింగ్—శ్రీ టి. ఆర్ సుందరేశన్. శంఖు—శ్రీ యెల్లా సత్యనారాయణ, డోలు—శ్రీ టి నారాయణ, నాదస్వరం, శహనాయి—శ్రీ తిరుప్పాల్ తంబుర—శ్రీ యెల్లా బాల మురళీ కృష్ణ, గజ్జెలు—శ్రీ సుభానల్, ఘంటలు—శ్రీ సోమయాజులు. ఇతర రాష్ట్రాల



శ్రీ యెల్లా వెంకటేశ్వరరావు

## హైదరాబాద్ నోట్‌బుక్

లోను, ఇతర దేశాలలోను పండిత పామరులను మెప్పించి విశేష కీర్తి నార్జించగల ఈ శివ తాండవ ప్రదర్శనాన్ని వివిధ స్తోత్రాలతో పాటు రూపొందించిన శ్రీ యెల్లా వేంకటేశ్వరరావును, తత్తాండవానుగుణ శైలీ రీతుల వివరించినవ్యాఖ్యాత శ్రీ ఏ. ఎస్. మూర్తిని సహ కళాకారులను, ఇలాటి పథకాన్ని సృష్టించిన దేవాదాయ ధర్మాదాయశాఖాధికారులను మరొకమారు అభినందిస్తున్నాను. ఇలాటి పరమోత్తమ కళాఖండం చిన్న లోపాలతో కళంకితం కారాదు గనుక కొన్ని సూచనలు చేయడం విధిగా భావిస్తున్నాను. మృదంగనాదంలో అపశబ్దాలు వింటే మార్దంగికులు ఎలా బాధ పడుతారో, తాండవం మధ్యలో గుప్పించిన స్తోత్రాలలో అప శబ్దాలు, ఉచ్చారణ లోపాలు వస్తే తద్‌జ్ఞులు నొసలు చిట్లిస్తారు. కనుక గాయకులు ఉచ్చారణలో లోపాలు రానివ్వరాదు.

ఆంగికం భువనం యస్య అనే ప్రారంభ ప్రార్థన శ్లోకం చివరిపాదం తం వందే శాశ్వతం శివం అని కాని నేను నృత్యాలు తరచు చూస్తున్నాను తంవందేలోని తం మింగేస్తున్నారు. ఎందుకో? చిదానంద రూప శ్శివోహం శివోహం—అనే దానిలో చిదానంద రూపా అని నోరు తెరిచేసి శివోహం అంటున్నారు. సంస్కృతంలో ద్విత్వాక్షరం వెనుకటి అక్షరాన్ని తప్పనిసరిగా ఒత్తి పలకాలి. తెలుగు, కన్నడాలలో అలాటి వాటిని తేల్చి పలికే అలవాటును బట్టి చిదానంద రూప శివోహం శివోహం అంటారు ఇది చాల వికారంగా వినిపిస్తుంది. చందో భంగం కూడ చిదానంద రూపశ్శివోహం అని కాని, రూప. శివోహం అని కాని పలికితే వికారమూ వుండదు చందో భంగమూ వుండదు. మిత్రులు శ్రీ ఏ. ఎస్ మూర్తి తాండవానికి కావలసిన స్తోత్రాలను ఆయా సందర్భానుసారంగా చక్కగా గుది గుచ్చారు. కాని, ఆయన కాలం సంగతి గుర్తించాలి. శివతాండవాన్ని బ్రహ్మాది దేవతలు చూచి ఆనందించి ఇలా స్తుతించారంటూ శ్రీ శంకరులవారు రచించిన స్తోత్రాలో, అర్వాచీన స్తోత్రాలో పాడితే ఎబ్బెట్టుగా వుంటుంది.

### పాత ఆటలకు ప్రాముఖ్యం !

పశ్చిమ జర్మనీలోని బాల బాలికలు క్రొత్తగా వచ్చిన కంప్యూటరు, క్యూబ్, టీవి ఆటలతో పాటు పాతకాలపు ఆటలకుకూడా ప్రాముఖ్యతనిస్తున్నారు పిల్లల ఆటల్లో ఏర్పడుతున్నమార్పులను పరిశీలించడానికి యిటీవల జరిపిన సర్వేలో పై విషయం వెల్లడైంది పాతకాలపు ఆటల్లో గాలిపటాలు, బొంగరాలు బాగా వ్యాప్తితో వున్నాయి కోలోన్ ప్రాంతంలో పాటలుపాడుతూ స్కిప్పింగ్ ఆడటం మళ్లీ వ్యాప్తిలోకి వచ్చింది. బొంగరాలు తయారు చేయడం 20 సంవత్సరాల క్రితమే మానుకున్నారు. కానీ యిది పిల్లల అభిమానాన్ని చూరగొనడంతో మరల వీటిని తయారు చేస్తున్నారు. చాలా రకాల ఆటలు తలితండ్రులు, తాతలు పిల్లలకు నేర్పకపోవడం వలన కనుమరుగైపోతున్నాయని ఈ సర్వేలో తేలింది.

కనుక శ్రీ మూర్తి శైవ పురాణాలలోని స్తోత్రాలను అనుసంధిస్తే బాగుంటుంది. శైవపురాణాల్లో మార్కండేయాది మునులు రచించిన శివ స్తోత్రాలు వివిధ వృత్తాలలో వున్నాయి అవి ఈ తాండవానికి చాల నప్పుతాయి. శ్రీ యెల్లా వేంకటేశ్వరరావు దీనికి దర్శకులు. ఆయన ముందు కూర్చుంటారు. ఆయన వెనుక వాద్య కారుల బృందం వుండడంవల్ల ఆయన తరచు వెనక్కు, పక్కకు తిరగడంవల్ల శ్రోతల దృష్టి, మనస్సు కదలిపోతాయి. కనుక ఆయన ఒక కోణంలో, బృందమంతా ఆయన దృష్టి పరిధిలో వుండేట్టు ఏర్పాటయితే దర్శకత్వానికి సులువు ఈ ఉత్తమ కళాఖండం దోష దూషితం కారాదనే సదుద్దేశంతో చేసిన సూచనలను సహృదయతతో స్వీకరించాలని అభ్యర్థన.

**ఉపశ్రుతి :**

ఏం సార్, వేషం మార్చారే ?— అనడిగాను ఇటీవల ఒక పార్టీనుంచి ఇందిరా కాంగ్రెస్‌లో చేరిన ఒక పెద్ద మనిషిని. మీ ప్రశ్న వింటుంటే కాళోజీ చలోక్తి జ్ఞాపకం వస్తున్నదండీ— అన్నారు నా పక్కనవున్న ఒకరు. ఏమా చలోక్తి ?— అన్నాము ఏక కాలంలోనే నేనూ, ఆ పెద్ద మనిషి. ఏమి వేషం బ్రదర్ ?—అన్నారట ఎవరో కాళోజీని. విచ్ సూట్స్ వెదర్ (వాతావరణానికి అనుకూలమైంది) అని సమాధాన మిచ్చారట కాళోజీ.







Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.



"ప్రళయరుద్రుడు" లో
కృష్ణంరాజు, జయప్రద